ఆధునికాంధ్ర శక్తిపీఠము

# శారదా సమారాధనం





వక్త, రచయిత

ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం

ఆధుని కాంధ్ర కవిత్రయ

# శారదా సమారాధనం

(సాహిత్యోపన్యాసాలు)

రాయప్రోలు

కాటూరి



విశ్వనాథ


వక్తృ, రచయిత :

ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం


* *


శ్రీ గిరిజా ప్రచురణలు

విద్యాలంకార్, బి-31

శ్రీనివాసనగర్ కాలని

గుంటూరు - 6

ప్రథమ ముద్రణ | మార్చి | వెల
వేయి ప్రతులు | 1989 | పది రూపాయలు

# ఉపన్యాసత్రయం

**26-4-1987**

అధ్యక్షులు :
శ్రీ ముదిగొండ శివరామకృష్ణశాస్త్రి
మార్కండేయ
ప్రాచ్యకళాశాలాధ్యక్షులు
ఆగిరిపల్లి

విషయం :
రాయప్రోలువారి కవితా
రామణీయకం

**27-4-1987**

శ్రీ సి. రాఘవాచారి
సంపాదకులు—విశాలాంధ్ర
విజయవాడ

విషయం :
కాటూరివారి కవితాత్మ

**28-4-1987**

శ్రీ పాటిబండ సుందరరావు
న్యాయవాదులు
విజయవాడ

విషయం :
కవిసమ్రాట్ కృష్ణకవితాకలాపం

సత్కారం : శ్రీ ముమ్మనేని సుబ్బారావు
పద్యసన్మానపత్రం : శ్రీ కాపూరి పూర్ణచంద్రరావు
బిరుద ప్రస్తుతి : శ్రీ మెట్టా వేంకటేశ్వరరావు

సభావేదిక :
చేంబర్ ఆఫ్ కామర్స్ భవనం
గాంధీనగరం—విజయవాడ

## సాహితీ చతురానన
## బిరుదంతో



ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తాన్ని

డాక్టర్ జంధ్యాల శంకర్
విజయవాడ మహానగర మేయర్

సత్కరిస్తున్న దృశ్యం

# నే వరించిన శ్రోత



విజయవాడ మహానగరంలో నే నొనర్చిన సాహిత్యోపన్యాసాల్ని
వ్యాసాఌగా వ్రాసి వినిపిస్తుంటే శ్రద్ధగా వింటున్న
శ్రోతృవరేణ్యులు, సహృదయ శిరోమణులు
సౌజన్యమూర్తులు
డాక్టర్ పిన్నమనేని వేంకటేశ్వరరావు మహోదయులు

అమృత హస్తులుగా
సుధామధుర హృదయులుగా
శస్త్రవైద్య విజ్ఞాన విశారదులుగా
భిషగ్వరేణ్యులుగా
వాసికెక్కినవారు శ్రీ పిన్నమనేని.

ఎంతటి మేధావులో అంతటి ఆర్ద్ర హృదయులు.
భాషా సాహిత్యాభినివేశులు,
నిరాడంబర జీవనులు,
విస్తృత భావసుందరులు.
పెక్కు వైద్యాలయాల్ని
వైద్య విద్యాలయాల్ని
చక్కదిద్దిన చతురమతులు.
నిరంతర శాస్త్ర కావ్య కళాగవేషణోన్ముఖులు
విజయవాడ సిద్ధార్థ విద్యాపరిషదధ్యక్షులుగా
అనేక సామాన్య సాంకేతిక విద్యాసంస్థల్ని
సమర్థంగా సవదరిస్తున్న సరసశిల్పులు.
పిన్నమనేని బహుముఖ వైద్య చికిత్సా కేంద్రం
వారి అత్యాధునిక శస్త్రవైద్య నేతృత్వానికి వేదిక.
విధి నిర్వహణంలో
శ్రద్ధాసక్తులు సడలనీయని నాగేశ్వరులు.
ఈ సకల మనోరథ సఫలీకృతయశస్వి
విజయవాడ మహానగర విశిష్ట పౌరమహాశయులు
నే నొనర్చిన సాహిత్యోపన్యాసాలకు
ఏవంవిధ వ్యాసాకృతిని సవదరించి
వినిపిస్తుంటే, వీనులిచ్చి
ఆదరంతో ఆలకిస్తున్నారు
శ్రీ వేంకటేశ్వరరావుగారు
అని సరసంగా సంభావిస్తున్నాను.

వీరు సహస్ర మాసాధిక పుణ్యమూర్తులై
నిరంతర సరససాహిత్య శ్రవణానంద సౌహిత్యులు కావాలని
నా హృదయపూర్వకాకాంక్ష.

# FOREWARD

In March 1985, Dr. Boddupalli Purushotham delivered a lecture on 'POTANA' under the auspices of 'Rasa Bharathi' a well-known organisation here which has done yeoman service to the people in inculcating taste for the very best in our literature. During the course of his very illuminating talk which was highly appreciated by the discerning listeners, Dr. Purushotham made a passing reference to some of the modern poets on the contemporary scene revealing his in-depth study of them and appreciation for their significant contribution to Telugu literature. At the end there was a spontaneous request from the elite gathering that he should deliver a few lectures here devoted exclusively to Rayaprolu, Katuri and Viswanadha. A Committee for this purpose with some prominent citizens who are also great lovers of literature was formed and Dr. Purushotham kept up his promise by enlightening the listeners on the poetic excellences of the trio on three days. Naturally, those who heard his three well-prepared speeches delivered in his inimitable and highly listenable style, came out with a suggestion that they should be published in a book form. This book is the result of that demand which was very sincere and persistent and also the munificence of Dr. Sudha and Dr Nageswara Rao, a genial Doctor couple whose love of our classical literature is matched only by their readiness to contribute their mite in spreading sweetness and light around them.

Dr. Purushotham who retired recently as Professor and Head of the Department of Telugu and Oriental Languages, Nagarjuna University is a scholar of repute. He is held in high esteem by a large number of his students and research scholars who earned their Ph. D. degrees under his guidance. As a speaker, he holds a sway over his listeners by his torrential flow of apt words, chaste diction and perfect command over language. On subjects of his choice and specilisation, he can speak with authority and conviction.

The lectures in this book on Rayaprolu, Katuri and Viswanadha will only whet the appetite of the readers as, by their very nature, they are, not meant to be exhaustive. If at least a few of the discerning readers are sufficiently inspired by those lectures, this effort of presenting three of the brightiest gems among Telugu poets in proper light would have not gone in vain.

Vijayawada
25-2-1989

ANDAVILLI SATYANARAYANA
*Convenor : Sarada Samaradhana*

# రాయప్రోలు వారి
# కవితా రామణీయకం



"తల్లీ! నీ సుతు సుబ్బరాయ
కవితా తత్త్వ ప్రకాశార్థమై
యుల్లంబందున నిల్చి జృంభణముగా
సూక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను
సంప్రీతిన్ రసోస్మేలిసీ!
ఫుల్లాబ్జాక్షీ! సరస్వతీ!! భగవతీ!!
పూర్ణేందు రమ్యాకృతీ!!"

* * *

రసశేవధియైన సభాధ్యక్షులకు, రసశేఖరులైన సభ్యమహాశయులకు నమస్కారాలు. విజయవాడ పౌరులముందు సాహిత్యాన్ని గూర్చిగానీ కవులను గూర్చిగానీ మాట్లాడటమంటే హనుమంతుల ముందు కుప్పిగంతులు వేసినట్లే. అందులో అధ్యక్షులవారు పెద్ద హనుమంతుడు. నాయీ సాహసాన్ని వాత్సల్య రసోల్లసితులైన మీరు తప్పక క్షమిస్తారనే భావిస్తున్నాను.

*

సహస్ర మాసాధిక ధన్యజీవి ఆచార్య రాయప్రోలు. ఆయన అభినవ కవితాచార్యుడు. మొట్టమొదటగా విశ్వవిద్యాలయంలో తెలుగు ఆచార్య పీఠాన్ని అధిష్ఠించిన అదృష్టవంతుడు. ఆయనకు ఏ డిగ్రీలు లేవు. అయినా వన్నెకెక్కాడు. కవికి ఏ డిగ్రీలు, పాండిత్యం అవసరంలేదు. సృజనకు ఆచార్య పీఠం ఆంగ్లేయ విశ్వవిద్యాలయాల్లో ఉంది. ఈ పుట్టుకవికి కూడా అటువంటి అదృష్టం పట్టింది.

ఇంతటి అదృష్టం ఏలా పట్టింది? ఊరకే వరించలేదు, అదృష్టదేవత. ఏదో రహస్యముంది? అది ఏ పరిశోధకుడు గ్రహించలేదు. ఎక్కడా ఎవ్వరు ఉద్ఘాటించలేదు ఆయన లలితాదేవీ నిరంతర సహస్రనామ పారాయణ పరాయణుడు. అందుకే ఆయన సహస్ర మాసాధికజీవి అయినాడు. పచేళిమ కవితా రామణీయకాన్ని సాధించాడు.

ఆయన ఇల్లు లలితాకుటీరం. ఆయన తొలి కావ్యం లలిత. ఆయన దుహిత లలిత. ఆయనది లలిత వాక్కు. ఆయనది లలిత కవిత. ఆయన గృహసీమలో లలితాదేవి బాలాత్రిపురసుందరిగా చిరుగజ్జెలతో నర్తించింది. ఆయన్ను నిరంతర సౌందర్యోపాసకుణ్ణి కావించింది. ఏ ఉపాసన లేనిది, ఏ దైవబలం లేనిది జీవితంలో ఎవ్వరు ఔన్నత్యాన్ని సాధించలేరు. ఇది పూర్వ విశ్వాసం. లలితా సహస్ర దివ్యనామస్తోత్రం దినానికొకమారు పఠిస్తే అతని రసనాగ్రంపై సరస్వతి సర్వదా నటిస్తుంది.[1]

*   *

---

1 యస్త్వేకవారంపఠతి పక్షమాత్ర మతంద్రితః
భారతీ తస్యజిహ్వాగ్ర రంగే నృత్యతి నిత్యశః

పరివర్తన :- స్కూల్ ఫైనల్ పరీక్ష తప్పి, పనిపాటల్లేకుండా తిరుగుతుండేవాడు రాయప్రోలు. కాని పద్యాలు రాసేవాడు హృద్యంగా. మేనమామ గొప్ప పండితకవి. తిరుపతి వేంకటకవుల ప్రధాన శిష్యుడు. 15 నిమిషాలకు 45 పద్యాలు ఆశువుగా చెప్పి, వేమవరం శతావధానంలో తిరుపతి వేంకటకవుల కీర్తి పతాకను ఎగరవేసిన ఉద్దండుడు. వేంకటశాస్త్రిగారికి శిష్యరూపుడైన గురువు. ఆయనే కీ. శే. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి వరేణ్యులు. ఈయనతో కలిసి అవధానాలు చేస్తుండేవాడు.

రాయప్రోలువారికి మంచి ధారణ ఉండేది. 1927లో, అంటే నేను పుట్టిన సంవత్సరం బాపట్ల భావనారాయణ స్వామి ఆలయంలో తిరుపతి వేంకటకవులు అవధానం చేసారు. వారు తిరిగి పోతుంటే మా బాపట్లమీద రెండు పద్యాలు చెప్పమని మానాన్నగారడిగారు. అప్పుడు తిరుపతి శాస్త్రిగారు రెండు పద్యాలు చెప్పారు. అవి ఇవి.

"చిర సౌభాగ్యము కల్గి ప్రాగుదధి
వీచీమాలికాడోలికా
చర వాతార్భక సేవ్యమాన నిజ
వత్సంబైన బాపట్ల పూ
రరుణాంభోజదళాక్షి! మాకు
సెలవిమ్మా! బోవుమా యెల్ల వ
త్సరముల్ తిర్పతి వేంకటేశ్వర
నిఖాతంబున్ జయస్థంభమున్॥
సరసీ జాలయ! నీ యెడన్ నిలువ
నిచ్చల్ భావనారాయణ
స్థిర కారుణ్యా రసాతిరేకమున
వృద్ధిన్ జెందుచున్ మమ్ములన్

స్మరియింపం గదవమ్మ! చూపగద
వమ్మా! నీ దయాపూర సం
భరితాంతః కరణ ప్రసార
మెపుడున్ మాపట్ల బాపట్లకో!"

ఈ పద్యాలు మా నాన్నగారు ఎప్పుడూ చదువుతుండేవారు. అందువల్ల నాకు నోటికివచ్చాయి. ఇదే తెలుగు పద్యశక్తి ఆశువులోకూడా అశక్తికోల్పోకూడదు. "మీకెట్లా ఇవి నోటికి వచ్చాయ"ని మా నాన్నగారిని ప్రశ్నిస్తే సుబ్బారావు ధారణచేసి రాసిచ్చాడని చెప్పారు. అది ఆయన ధారణ పటిమ. బాపట్ల అవధాన మంతా రాయప్రోలువారే కాటూరివారికి రాసిచ్చారంటారు.

అది 1911 సంవత్సరం. శ్రీ బెజవాడ పట్టాభిరామిరెడ్డిగారి అధ్యక్షతను రాయప్రోలువారు మేనమామతో కలిసి అవధానం చేస్తున్నారు. మేనమామకున్న శాస్త్రప్రజ్ఞత లేదీయనకు. ఏదో అపశబ్ద ప్రయోగం జరిగింది. వెంటనే చేయిపట్టి లాగి కూర్చోబెట్టి పద్యాన్ని పూర్తిచేసారట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. దానితో ఆయనలో ఏదో చెప్పరాని మార్పువచ్చింది. ఇంక అవధానాలకు స్వస్తిచెప్పాలనే నిర్ణయాన్ని ఆశువుగా అప్పుడే సభాసదుల ముందిట్లా ఉద్ఘాటించాడు.

తెనుగే తీయని దందు పద్యపద
రీతిక్రీడ లత్యంత మో
హనముల్, శోభనముల్ తదీయ
రసరక్తాలాపనంబుల్, లభిం
చిన వాగర్థ కలాకలాపజయ
లక్ష్మిన్ గాలికిం బుత్తునే?
జననీ! యేమిటి కింక? ఆశు కవితా
సన్న్యాస మిప్పింపవే!!

రసమో? భావమో? జీవ దర్థ
సుకుమార వ్యంజనా మంజు శ
బ్ద సమాసారచనంబా? సాధు హృదయ
స్పంద ప్రతిష్ఠా కథా
విసరంబో? సకలార్థ శూన్యమగు
నీ వేగాతి వేగోక్తి దు
ర్వ్యసనం బేటికి? త్రిప్పుమింక
జననీ'! రమ్యాక్షర క్షోణికిన్"

అంతేకాదు, "కపురంపుం బలుకుల్, తెనుంగులివి, వేగ ప్రక్రియాధోరణీ విపరీతానిలధాటిలో చెరగినన్ విధ్వంసమైపోదె తద్విపులామోదము? మెత్తురే రసికులీ విన్యాస వైకల్యమున్?" అని పరిదేవనం చెందారు

అవధానాలు గారడీలవంటివి. వాటి ప్రదర్శనంవల్ల ప్రజల్ని ఆశ్చర్య చకితుల్ని కావించవచ్చు. ధనార్జనం చేయవచ్చు కాని శాశ్వతకీర్తి లభించాలంటే సత్కావ్యరచన కావించాలి. అవధానాలుచేస్తు కావ్యాలుకూడా రాయవచ్చని భావించేవాళ్ళు ఉంటారు. అప్పుడాకావ్యాలు ఆశుకావ్యాలుగానే ఉంటాయి. అందులోను గణాచారే గోచరిస్తాడు. గుణాచారి కనిపించడు. శిల్పం ఉండదు. "నిలకడ వలయు కృతికి" అంటాడు అప్పకవి.[1] ఆ నిలకడ ఆశుకవికి, అవధాన కవికి ఉండదు.

యతిప్రాస లతిక్రమించి పద్యం నిర్మించిన వాళ్ళందరు దేశంలో కవులుగా చెలామణి కావటం దురదృష్టం. వాళ్ళు కుంభకారుల్లాంటివారు. పద్యకారులు. కవులుకారు.

---

[1] "ఆశుధారా కవిత్వంబులందు శయ్య
లుపమ లుత్ప్రేక్షలును లేక యుండుగాన
నెంత యోజించినను బద్యమంత సార
వంత మగు గాన నిలకడ వలయు కృతికి"

అప్పకవీయము – I – 59

రాయప్రోలు వారిలో ఇటువంటి పరివర్తనం రావటం, అప్పటినుండి రమ్యాతిరమ్యమైన కావ్యసృష్టికి పూనుకోని 'అభినవ కవితా పితామహుడు' కావటం ఆంధ్రజాతి చేసుకొన్న పుణ్యం అనక తప్పదు.

ఈయనకు పూర్వం కందుకూరి వీరేశలింగంగారిలోను ఇటువంటి పరివర్తనమే ప్రవర్తిల్లింది. నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర నైషధాది కావ్య నిర్మాణానికే అంకితమైన ఆ కవి, జాతిలో పేరుకొన్న అజ్ఞానాంధకారాన్ని నిర్మూలించే రచన కావించటానికి ఉత్కంఠించటం ఆంధ్రజాతి అదృష్టంగా భావించాలి. ప్రబంధ శైలిలో పద్యాలు వ్రాసే శ్రీరంగం శ్రీనివాసరావు శ్రీశ్రీగా మారి మహాప్రస్థానకవి కావటం కూడా తెలుగువారి అదృష్టమే.

రామణీయకం :— తెలుగుభాషలో నిసర్గంగా ఉన్న రమ్యత్వాన్ని తన కావ్యరచనల్లో ఇంతగా కొల్లగొట్టిన ఆధునిక కవి ఇంకొకడు కన్పించడు.

తెనుగు భాష నాయన ఏరీతిగా ఆరాధించాడో ఆలోకించండి.

"వంశిన్ వంచి, మృణాళమున్ మెలచి
పక్వద్రాక్ష నొండించి, వా
గంశల్ మార్దవ మాధురీ సుభగ
విన్యాసంబు జిల్కన్, దశ
త్రిశల్లక్ష జన ప్రసన్న రసనా
దేవాలయాభ్యంతర
ప్రాంశు ప్రార్థన గీతమైన తెనుగుం
బల్కన్ ప్రశంసించెదన్"

"తేనియ ఘనీభవించి, ముత్తెములవంటి
పలుకులైన విధాన సుస్వాదు సుఖ క
లధ్వనుల్ మృదూచ్చారణ లలిత మధన
పాకముల చిక్కబడి తెన్గుపల్కులయ్యె"

ఇటువంటి తెనుగుపల్కులే రాయప్రోలివారి కవితనిండా.

"పాల క్రొమ్మీగడల్ పచ్చి వెన్నయి విచ్చి
తీయని సునః పూస లాయెనేమొ!
కమ్మని మకరంద కణములు స్నేహించి
చిన్నారి పలుకులై చిక్కనేమొ!
పూల లావణ్యంబు పొంగి చక్కదనాల
పిండులై రుచులెక్కి పెరిగెనేమొ!
సెలయేటి యుయ్యాల కులుకుటొయ్యారముల్
ముద్దు ముచ్చటలయి ముదిరెనేమొ!
పాటకును పద్యమునకు నమ్రముగ నొదిగి
చవికి చాతుర్యమునకు సాజముగ సాగి
పోరునకు పొత్తునకు చాలి, పొంది పొసగు
మా తెనుగుతల్లి మెడ కిదే మల్లెదండ"

తన కావ్యాలనే మల్లెపూలదండలతో తెనుగుతల్లి నలంకరింప జేసిన ధన్య కవీశ్వరుడు శ్రీ రాయప్రోలు. "మా తెలుగుతల్లి కీ మల్లెపూదండ" అనే ప్రసిద్ధ గేయానికి స్ఫూర్తి ఈ పద్యమునుండి లభించిందనిపిస్తుంది.

ఈ విషయంలో ఆదికవి నన్నయ భట్టారకుడే ఆయనకు గురువు.

"అక్షర రమ్యత నెరిగిన
దక్షుడు, ఈ చిరార్థసూక్తి ధాముడు, వాచా
భిక్షువుల కొసగె భారత
చాక్షుషసూత్రమ్ము నుభయ చరితార్థముగన్"

అని అంజలి ఘటించి భిక్షకొన్న చరితార్థుడు. అభినవ నన్నయభట్టారకుడుగా అభ్యర్చితుడైనాడు.

ఈ సందర్భంలో అలంకార సంబంధమైన రహస్యాన్ని ఒకదాన్ని గమనించాలి. కావ్యమంటే ఏమిటో అనే కాలంకారికులు నిర్వచించారు. ఈ

నిర్వచనాల నన్నింటినీ పరాస్తంచేస్తు ఆంధ్రుడైన జగన్నాథపండితరాయలు "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అని నిర్వచించాడు ఇది అందరకు శిరోధార్యమైంది. ఈ నిర్వచనానికి లక్ష్యభూతమైంది, నన్నపార్యుని కవిత. నన్నపార్యుడో క్రొత్తరీతిని సాధించాడు. ప్రసాద గుణానికి పటుత్వాన్ని చేకూర్చటం, ఓజోగుణానికి ప్రసాదత్వాన్ని ప్రసాదించటం. అంటే అక్లిష్ట మనోహర సమాస భూయిష్ఠమైన కవితా రీతిని సాధించాడు. దీన్నే "ఆంధ్రీరీతి" అనవచ్చు. రమణీయమైన అర్థాన్ని రమణీయమైన భాషద్వారా సాధించినపుడు అది కావ్యమౌతుందని, పండిత రాయలు నన్నయ భారత రచన ఆధారంగా చేసికొని ఈ నిర్వచనాన్ని కావించాడనవచ్చు.

రమణీయమంటే ఏమిటి? "క్షణే క్షణే యన్నవతా ముపైతి, తదేవరూపం రమణీయతాయాః" అని మాఘుడంటాడు. సూర్యచంద్రోద యాస్తమానాదులు రోజూ చూస్తున్నా ఎప్పటికప్పుడు క్రొంగ్రొత్తవిగా ఎలా గోచరిస్తాయో, అలాగే రచనలు కూడా చదివే కొద్దీ చవులూరించేవిగా ఉండాలి. చందనపుకర్రను ఛేదించేకొద్దీ ఏవిధంగా సువాసనలు గుబాళించుకొంటు వెలారుతాయో, అదే విధంగా కావ్యాన్ని మథించేకొద్దీ అమృతం ఆవిష్కృతం కావాలి. ఇప్పుడు పుంఖానుపుంఖంగా వస్తున్న నవలల్ని రెండోమారు చదవే రసికుడుండడు. కారణం, అందులోని అర్థం తేటతెల్లం. భావుకుడైన సహృదయుడికి తగినంత వ్యంజనా వ్యాపారం సాగించటానికి సమర్థమైన శబ్దం అందులో మృగ్యం. కావ్యం అలాంటిదికాదు. సహృదయుడైన పాఠకునికి కావలసినంత వ్యంజనా వ్యాపారాని కనుకూలమైన శబ్దార్థాల రామణీయకం అందులో పుష్కలంగా లభిస్తుంది. అంటే కావ్యం ధ్వని ప్రధానమైందని గ్రహించాలి. ఈ విషయం ముందు ప్రపంచితం.

రాయప్రోలువారి కవిత కాంతాసమ్మితమైంది. అది అయస్కాంతంలాగా ఆకర్షిస్తుంది పాఠకుణ్ణి. ఆయనది కాంతామనోజ్ఞ హృదయం. 'కవితలల్లెడి కాంత హృదయుల భక్తి పాడర తమ్ముడా!' అని ఆయన ప్రబోధం. ఆయన కావ్యలోకం రామణీయక జగత్తు. ఆయన హృదయం మనోజ్ఞ కవితారామం.

అందులో ఏరిపారవేయవలసిన ఫలంఅంటూ లేదు. "There is no forbidden fruit in the garden of Poesy" అని అంటాడు మిల్టన్. అచ్ఛమైన కవితామృత కలశం శ్రీ రాయప్రోలు హృదయం. పూర్వపు కావ్యాల్లో అక్కడక్కడే రమ్యమైన కవిత సాక్షాత్కరిస్తుంది—ఎడారుల్లో ఒయాసిస్సులలాగా. కథ చెప్పటం గొప్ప కవిత్వం అని భావిస్తారిప్పటికి కొందరు. ఇప్పుడు 'కథ' ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియ. పాత్రచిత్రణం నాటకాల్లోను, నవలల్లోను చూడవచ్చు. చూడాలికూడా. కాని కవిత్వంలో స్వచ్ఛమైన కవిభావుకతా ధర్మం మూర్తీభవించాలి. రాయప్రోలు కథాకావ్యాలు రచించాలని ఆరాటపడలేదు. ఎంతో కథ నేపథ్యంలో దాచి, మనోజ్ఞభావనా విలసితంగా లఘుకావ్య రామణీయకాన్ని చేకూర్చాడు. ఎన్నో భావచిత్రాల్ని తన కలమనే కుంచెతో సహృదయ హృదయ భిత్తికలపై చిత్రించిన రమ్య చిత్రకారుడు రాయప్రోలు. కవిత్వంలో శిల్ప ధర్మం ఎలా ఉండాలో ఆధునికులకు రుచి చూపించిన ఆదర్శ శిల్పి.

ప్రభావాలు :— ప్రతి గొప్పవ్యక్తిమీద అనేక మహావ్యక్తుల ప్రభావం ప్రసరిస్తుంది అనేకోద్యమాలచేత ప్రభావితుడౌతాడు. అయితే కొందరా ప్రభావానికి దాసులై సంచరిస్తారు. అప్పుడు వారి వ్యక్తిత్వంకన్న ప్రభావముద్ర మిన్నగా కనిపిస్తుంది. కొందరా ప్రభావాల్ని రక్తసిక్తం గావించుకొని, తమ సంస్కారం కొద్దీ తమ వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకొంటారు. తమ సొంత గొంతు విప్పి జాతికి తమ సందేశాన్ని వినిపిస్తారు. తమ ప్రభావాన్ని తమ తరువాతి వాళ్ళమీద ప్రసరింపజేస్తారు.

రాయప్రోలు కవి ఈ కోవకు చెందినవాడు. తనపై ప్రసారితమైన ప్రభావాల నన్నింటిని అంతర్భుక్తం చేసుకొని స్వీయకంఠంతో కోకిలలాగా కవితాలాపన కావించారు. ఆ తరువాతి కవులెందరో ఆయన మార్గదర్శకత్వాన్ని అంగీకరించారు. స్వీకరించారు. అయినా అభినవాంధ్ర కవితకాయన 'యుగకర్త' అనటానికి ఎందుకో కొందరు సందేహిస్తారు. అది మనస్సంకోచం. కంటికి కనిపించే సత్యాన్ని అంగీకరించటానికి కూడా ఈ రోజుల్లో విమర్శకులకు ధైర్యం చాలటంలేదు.

రాయప్రోలు వారు ఆచార్యపీఠం అలంకరించటానికి పూర్వం రాజమహేంద్రవరంలో కొంతకాలమున్నారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు స్థాపించిన 'దేశాభిమాన' పత్రికకు ఉపసంపాదకులుగా ఉన్నారు. వారినుండి ఎంతో గ్రహించానని చెప్పారు. దేశభక్తి ప్రేరణ కల్గిందన్నారు. గురజాడవారి కన్యాశుల్కం తన్ను బాగా కదిలించిందనేవారు. కొమర్రాజువారి విజ్ఞానచంద్రికా గ్రంథమాలలో మద్రాసులో కొన్నాళ్ళు పని చేసారు.

వీరందరు ఒకయెత్తు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఒక యెత్తు. ఆయన సాహచర్యంవల్ల సంస్కారవంతుణ్ణి అయినానని బాపట్లలో మేము నిర్వహించిన గోష్ఠి కార్యక్రమాల్లో ఉద్ఘాటించారు. ఏమిటా సంస్కారమో వివరించలేదు. అడిగితే "నా కావ్యాలు చదివి అర్థంచేసుకోరా! వాచ్యంచేస్తే ఎట్లాగురా!!" అనేవారు. నిజమే, కవిని కావ్యాలు చదివి గ్రహించాలికాని అంతా కవేచేప్తే ఏంబాగుంటుంది? అప్పట్లో అర్థంకాలేదు. దుగ్గిరాలవారి దృక్పథం చాలా విశిష్టమైంది. బ్రాహ్మణ వర్ణంకన్న బ్రాహ్మణత్వం చాలా గొప్పదని ఆయన సిద్ధాంతం అన్ని వర్ణాలవారు—బ్రాహ్మణత్వాన్ని సాధించాలని ఆయన ఉద్ఘాటించేవారు. రాయప్రోలువారు తమ కావ్యాల్లో బ్రాహ్మణ వాటికలు, పూరిండ్లు గోమయంతో అలకటం, ముగ్గులు పెట్టటం, నోములు, వ్రతాలు మొదలైన వభివర్ణించేవారు. పవిత్ర వాతావరణాన్ని సృష్టించేవారు. అదంతా మా వేదాలపల్లి (వెదుళ్ళపల్లి) వాతావరణం. ఇప్పుడది ఆధునిక రాక్షసులచే విధ్వంసమైంది.

కీ. శే. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వద్ద సంస్కృత వాఙ్మయ రహస్యాలు గుర్తించారు. వాల్మీకి, కాళిదాస భవభూతులాయన కారాధనీయులు. ఈ కవుల ప్రభావం ఆయన్ను వెన్నంటి ఉంది. అందుచేతనే చివరిదశలో సుందరకాండ అనువదించారు తిరుపతిలో ఉన్నప్పుడు మేఘసందేశాన్ని, అభిజ్ఞాన శాకుంతలాన్ని, ఉత్తర రామచరిత్రనుగూడా అనువదించారు, రసాత్మకంగా. శాకుంతలం ఆంగ్లానువాదం చదివి జర్మన్ కవి గెథే పిచ్చివాడిలాగా అయిపోయి ప్రశంసిస్తు పద్యం చెప్పాడు. నాకు ఈ రచయిత "ఊడిపోయిన ఉంగరం" బహూకరిస్తే (25-8-65) మహోత్కంఠతతో చదివి పూర్తిచేసేటప్పటికి తెల్లవారుజామున రెండుగంటలయింది. ఆ భావతీవ్రతకు తట్టుకోలేక జ్వరం

వచ్చింది. ఇటువంటి బాధ కందుకూరివారి అనువాదం బి.ఏ. తరగతులకు పాఠం చెప్పినప్పుడు కల్గలేదు హాయిగా సాఫీగా సాగిపోయిందది.

ఇది సంస్కృతకవుల ప్రత్యక్ష ప్రభావం. ఇది ముసలితనంలో మీద పడ్డది. బహుశః తనకు సంస్కృతం రాదనుకునేవాళ్ళకి సమాధానంగా వ్రాసారేమో అనుకున్నాను మొదట. కాని ఎన్నాళ్ళనుండో అణచుకొన్న లోలోపలి ఆర్ద్ర హృదయానుభూతితో కావించిన కళాత్మకమైన అనువాదాలే ఇవి అనాలి. సుందరకాండ అనువాదంలో సౌందర్యం మృగ్యం. కాని సంస్కృతకవుల పరోక్ష ప్రభావం చిన్నప్పటినుండి ఉంది. తన ప్రకృత్యుపాసనలో కీట్సు, షెల్లి, వర్డ్సువర్త్ వంటి ఆంగ్లకవుల ప్రభావముందనే విమర్శకు రాయప్రోలు వారు ఆశ్చర్యం ప్రకటించేవారు. కాళిదాసుని మించి ప్రకృతి వర్ణన ఆంగ్లకవులకేం తెలుసని ప్రశ్నించేవారు. ఇక్కడో సత్యం గమనించాలి. పాశ్చాత్య కవులు సంస్కృత కవులచే ప్రభావితులై ప్రకృతి కవులైనారు. పాశ్చాత్య కవుల ప్రభావంచేత ఆధునిక కవులు ప్రకృతి వర్ణన తత్పరులైనారు. కాని రాయప్రోలు వారిలో సంస్కృతాంగ్ల కవుల ప్రభావం గోచరిస్తుంది.

అన్నింటికంటే రాయప్రోలువారు పదేపదే చెప్పేది— "మా పిన్ని ప్రభావం" అని. ఈమె స్త్రీలోని మాతృహృదయాన్ని రాయప్రోలు వారికి పూర్తిగా ఆవిష్కరించే చూపుతుండేది. త్రిమూర్తుల్ని కిశోరాలు కావించి స్తన్య మిచ్చిన అనసూయ ఆమె కారాధ్యదైవం. రాయప్రోలువారి రచనల్లో స్త్రీకి సమున్నత స్థానం లభించటం పిన్ని చేకూర్చిన భావనాబలంవల్లనే. అయితే కవి అంతటి 'పిన్నికి' ఒక్కకావ్యమైనా అంకితమిచ్చినట్లు కనిపించదు. హృదయమే ఆమె నామాంకితమైంది కాబట్టి వేరే 'అంకితం' న్యూనమౌతుందని భావించి ఉండవచ్చు.

రాయప్రోలువారు శాంతినికేతనంలో రెండు సంవత్సరాలున్నారు. అక్కడ గురుదేవుల ప్రభావంమాట వేరుగా ఉద్ఘాటించాలా? గురుదేవులతోకన్నా అక్కడ కలసిమెలసి జీవించిన నందలాల్ బోస్, అవనీంద్రనాథ్ టాగూర్, పియర్సన్ భావుకులను రాయప్రోలు సంస్మరించేవాడు. వారి నవ్యతాగుణాల్ని ఆరాధించేవాడు.

భాషాస్వేచ్ఛ, భావనారమ్యత ఇక్కడనుండి బాగా అలవరచుకున్నాడీకవి. కాని ఛందస్సులో ఎందుకో స్వతంత్రించకుండా సంప్రదాయాన్నే అంటిపెట్టు కొన్నాడు. ఇందుకు కారణం - మొదటినుండి అలవోకగా ఆళువుగా అలవడ్డ పద్యరచనాప్రీతి. దాన్నే బాగా సంస్కరించాడు.

భాషావిషయంలో ఈయన దృక్పథం — విశ్వకవి దృక్పథానికి సమీచీనమైంది. జటిల ప్రాబంధిక భాష ఈయనకు నచ్చదు. కవి హృదయోద్గత మైన భాషనే ఆదరించారు. అయితే సంప్రదాయకమైన పద్యరచననే విశేషంగా ఆదరించటంచేత వ్యావహారిక భాష ఈయన కావ్యభాషలో చోటుచేసుకోలేదు. కాగా వైరిసమాసం ప్రయోగించటం, రేఫ శకటరేఫ భేదాలు పాటించకపోవటం, విసంధిని పాదమధ్యంలోను పాటించటం, పాతవడ్డ పదాలు ప్రయోగించక పోవటం ఈయన భాషలోని కొన్ని విశేషాలు. అంటే తన పరిధిలో భాషా స్వేచ్ఛను పాటించాడు. గిడుగువారంటే వీరికెంతో గౌరవం. అందుకు 'స్మృతి' పద్యాలేనిదర్శనం. లక్ష్యాల్నిబట్టి లక్షణాలేర్పాటు కావాలంటంలో వీరేకీభవిస్తారు.

సుబ్బారావుగారు 'కవిభాషను' గూర్చి ఎంతో మనోజ్ఞంగా చెప్పారు — తమ రమ్యాలోకంలో.

"ధేనువులు తిను బహువిధ తృణచయమ్ము
లౌవు నానానదీకూప జీవనమును
కలిసి పరిణమింపవె పాలుగా ధరిత్రి ?
శబ్దమేళన తంత్రనైజమ్ము నిదియె"

సామాన్యజన వ్యవహారంలో ఉన్న భాష భావానుకూలంగా కవి హృద్గతమై రసాయనికమైన మార్పుచెంది రసోద్గారంగా ఉద్గతమౌతుంది. అదే కవికావ్యభాష. దీనిలో చిన్నయసూరి వ్యాకరణ ప్రమాణాలతో తప్పులు పట్టటం దారుణమని ఈయన అభిప్రాయం.

రవీంద్ర కవీంద్రుని వాక్యాల్లో తప్పులు దిద్దమని విశ్వవిద్యాలయ పండితమ్మన్యులు ప్రశ్నపత్రాల్లో ఉట్టంకించారు. రాయప్రోలువారి కావ్యభాషలో

దోషాలెన్నో సన్నిధానంవారు, ఉమాకాన్త విద్యాశేఖరులు పత్రికాముఖంగాను గ్రంథాల్లోను ఎత్తిచూపారు. కాని అందుకు రాయప్రోలువారేమీ ఉలిక్కిపడలేదు. సృజనాత్మకుడైన కవి ఇటువంటివి పట్టించుకోకూడదనేవారు. సమాసాలకు విగ్రహ వాక్యాలు పండితులు చెప్పాలి కాని కవులు చెప్పరనేవారు. పోతన్నగారి కవిత్వంలోనే ఎన్నో దోషాలు చూపినవారికి రాయప్రోలువారో లెక్కా? జమా? అయినా వీరి కవిత్వాన్ని ఆస్వాదించటానికి ఏ సహృదయుడు వెనుకంజ వేయలేదు.

మార్గదర్శకత్వం :- ఏవం విధంగా ఎంతమందిచేతనో ప్రభావితుడైనా తనదైన ఆత్మీయతతో అంతరాత్మ పరిమళ కవితా కళతో, (అమృతాం ఆత్మనః కళామ్ — భవభూతి) దేశాన్ని ఉర్రూతలూగించిన ఉదాత్త కవిరాజహంస శ్రీ రాయప్రోలు.

జాతీయోద్యమ కవీశ్వరుడుగా విశ్వనాథ, జాషువ, తుమ్మలవంటి కవులకు ఒరవడియైనాడు. అయితే రాష్ట్రోద్యమ కవితారచనలో తుమ్మలవారి రక్తం ఉడికిన ప్లేయితర కవికి ఉడకలేదనే చెప్పాలి.

భావ కవితోద్యమ పితామహుడుగా అసలు సిసలైన భావకవి కృష్ణశాస్త్రి గారికీయన అగ్రజుడు. తరువాతివాళ్ళు కృష్ణశాస్త్రిగారికి తమ్ముళ్ళు.

ఒకవంక చలం స్త్రీ పురుష స్వేచ్ఛా జీవితాన్ని బలీయంగా తన రచనల ద్వారా ప్రజల్ని ప్రభావితం చేస్తుంటే,రాయప్రోలువారు స్వేచ్ఛాకాముక జీవనాన్ని అరికట్టటానికి కావ్యరచన సాగించారు. 'దంపతీనిష్ఠ'ను ప్రతిష్ఠించటానికి ప్రయత్నించాడు స్త్రీ భోగవస్తువు కాదని, ఆమె సౌందర్యాన్ని ఉపాసించి పశు దశావరణాన్ని అతిక్రమించాలని కాంతాసమ్మితంగా ప్రబోధించారు.

'అమలిన శృంగారమ'నే తత్త్వాన్ని అపూర్వంగా తమ కావ్యాలద్వారా ప్రతిపాదించారు. శారీరక భోగానుభూతికీ — సంయోగ శృంగారానికీ పూర్వులు కావ్యాలు విరచించారు. అంతకన్న వియోగ శృంగారం బలీయమైంది మాన

పీయమైంది శారీరకమైన కామం మలినమైంది. మనః కామన అమలినమైందనే భావాన్ని తమ కావ్య కుసుమాల ద్వారా గుబాళింపజేసారు. ఇది ప్లేటో ప్రేమ సిద్ధాంతంకన్నా భిన్నమైంది. అందులో స్త్రీజనద్వేషం, స్త్రీ తిరస్కారముంది. ఇందులో స్త్రీ సమారాధనం ముఖ్యం. శారదా రామకృష్ణుల విచిత్ర దాంపత్య జీవనం, అర్ధఋషుల దాంపత్య జీవితాశయాలు రాయప్రోలువారికి మహితాదర్శాలై ఉంటాయని భావించవచ్చు నైతిక జీవిత సముద్ధరణానికి యథాశక్తిగా కానరాని కృషి కావించారు. ఆంధ్రజాతికి శారీరక మానసిక ఆధ్యాత్మికమైన ఆరోగ్యాన్ని, ఆనందాన్ని అందించాడీ కవిమూర్ధన్యుడు. తనదైన తాత్త్విక దృక్పథాన్ని రూపొందించారు. రోతగా సంభోగ శృంగారంలో పెడదారిపట్టిన సంప్రదాయానికి రమ్యమైన నూత్న ప్రాణంపోసి దాన్ని పొడిగించిన ప్రౌఢ నవ్యకవి రాయప్రోలు. ఇంకా ఈ విషయం విమర్శితమౌతుంది మున్ముందు.

ప్రపంచ సమాజాభ్యుదయాన్ని మనస్సులో నిల్పుకొని భవిష్యత్కాలంలో నరనారీసమూహం పరస్పర స్నేహ ప్రపూర్ణ ప్రఫుల్ల జీవితాన్ని ఎలా గడపాలో తన కావ్యాలద్వారా ధ్వనింపజేసిన క్రాంతదృష్టిగల కవితల్లజుడు రాయప్రోలు.

కోకిలస్వామి :— కవి, కోకిలవంటివాడు. కోకిల చిగుళ్ళు మేసి హాయిగా గానంచేస్తుంది — లోకం పులకించేట్లుగా. కవికూడా లోకవృత్తాన్ని తీసికొని గానంచేస్తాడు - తన్ను, తన వ్యక్తిగత అభిరుచుల్ని మరుగుపరచుకొంటూ.

కోకిల రూపం అసహ్యం. కవి వైయక్తిక జీవితం కూడా నైతికంగా గొప్పది కాకపోవచ్చు. అయినా అతడు నైతికంగా, ఆత్మపరంగా జాతి అభ్యున్నతికి దోహదం చేస్తాడు. జాతి భావనలో గొప్ప పరివర్తనం సాధిస్తాడు. బ్రహ్మానంద సబ్రహ్మచారియైన ఆనందానుభూతిని జాతికి కరతలామలకం కావిస్తాడు. నైతిక బోధచేసే కవి తక్కువ తరగతి కవి. పాఠకుడికి తెలియకుండానే నైతిక సముద్దీప్తిని (moral emulation) కల్గించే కవి ఉదాత్తకవి.

వాల్మీకి మొట్టమొదటి కవికోకిల. కవితాశాఖాధిష్ఠితుడై ఈ కవికోకిల 'రామ' 'రామ' కుహూకుహూరావాలు మధురంగా చేసినట్లు చెప్పే ఈ శ్లోకం లోక ప్రసిద్ధం. దీన్ని చదువుకొని లోక మా ఆదికవికి అంజలి ఘటిస్తుంది

"కూజంతం రామ రామేతి
మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితా శాఖామ్
వందే వాల్మీకి కోకిలమ్"

హింసాత్మక జీవనుడైన వ్యక్తి తపస్సుచే సంస్కారోపేతుడై వాల్మీకిగామారి కోకిలలాగా మధురాతి మధురమైన రామకథాలాపనం కావించాడు. ఎక్కడా రామాయణంలో వాల్మీకి తనవైయక్తికతను ప్రదర్శించడు

కవికోకిల ఆకుల్లో అణిగిమణిగి కవితాగానం చేస్తుందని, ఆ గానాన్ని ఆలకించి లోకం అభిమానపూరితమౌతుందని గురజాడవారు పేర్కొన్నారు.

"ఆకులందున అణగి మణగి
కవిత కోకిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమం
దభిమానములు మొలకెత్తవలెనోయ్"

తన రూపాన్ని కనిపించనీయకుండా, తన కంఠాన్ని వినిపింప చేయటమే కోకిల లోని విశేషం. కవికూడా అట్లాగే చేయాలి. ఆకుల్లో దాగటాన్ని గురజాడ బాగా ఉద్ఘాటించారు.

రాయప్రోలు వారు 'కోయిల' అనే శీర్షికను పదిపద్యాలు ఉదాత్త కవితా శైలిలో వివరించారు. అందులో మొదటిపద్యం :

"ప్రమద రసోదయాలస తరంగములన్
దవిలించి, పారవ
శ్యమున నుయ్యాలలూపెద వయారె!
చరాచర చేతన ప్రపం
చము బహిరంతర భ్రమణ సాధ్వసమేది
ప్రశాంతమయ్యె, నే
త్రములకు గానరావు, మధురంబుగ
పాడెద వెందొ కోయిలా!"

ఇందులో చివరి పాదంలో పి. బి. షెల్లి రచించిన 'టు ఎ స్కైలార్క్'లో 20వ పంక్తి భావం వ్యక్తమౌతుంది.[1]

ఆంగ్ల కవి పద్యం మొత్తాన్ని[2] ఈ క్రింది పద్యంలో చమత్కారం ఎలా పొందుపరచాడో పరిశీలించండి—

---

[1] "Thow art unseen, but yet I hear thy shrill delight."

[2] Like a high — born maiden
In a palace tower
Soothing her love — laden
Soul in secret hour
With music sweet as love,
Which overflows her bower : (TO A SKYLAF
41—44 lin

"ధవళ చిరత్న రత్నరచితంబగు
సౌధమునగ్రమందు పూ
వనకపుసెజ్జపై వలపునన్
తన కిన్నెర మేళవించి మో
హావశముగా ప్రపంచమును
నాకులపెట్టు నాయారివోలె, నీ
భువనమునెల్ల రాగమయ
భోగములన్ దనియింతో కోయిలా!"

ఆంగ్లంలో చిన్నపద్యం తెలుగులో ఎంతగానో ప్రపంచితమైంది అందుకు కారణం చేబట్టిన ఛందస్సు. ఇదే యేగేయ రచనో అయితే ఆభివత్వం తొణికిసలాడేది. పూర్వం సంస్కృతంలోని చిన్నచిన్న శ్లోకాలు కూడా తెలుగు కవులు చేతుల్లో ఇట్లాగే అయినాయి. 'అల్పాక్షరాల్లో అనల్పార్థరచన' తెలుగులో 'అనల్పాక్షరాల్లో అల్పార్థరచన' అయింది. ఈ చంపకోత్పల శార్దూల మత్తేభాదులు క్రీ. శ. 12వ శతాబ్ది అనంతరమే సంస్కృతంలో ప్రాచుర్యం వహించాయి. తెలుగులో 11వ శతాబ్దికి పూర్వపు శాసనాల్లోను ఇవి ప్రచుర మైనాయి. తెలుగు వారి భోజనంలాగానే తెలుగు కవితా భోజనం కూడా ఆడంబరమైంది.

రాయప్రోలు కవికోకిల ఇంకా కవితాలాపన చేస్తునేవున్నది. కోకిలను గాయకుడుగా, కవిగా, ప్రియురాలిగా, 'అంపకపుకూతు కవుంగలి బాయలేని మెత్తని తల్లిగా' 'జోలపాటపాడి నిద్రపుచ్చే తల్లి'గా 'కన్నెపూబోండ్లకు రాయబారాలు' కావించే దూతగా పరిపరి విధాల సంభావిస్తాడు కవి. కోకిల కూతలో 'మానిషాద' శ్లోకభావాన్ని కూడా ఎలా ఆలాపిస్తాడో ఆలకించండి:

"అకట! నిషాద! చేతులెటు
లాడె గదోయి? యభేదమోహాకా
తుక విపశాప్తి మైమరచి
త్రుళ్ళు కపోతము నేయగా వధిం
పకు వధియింప కంచు పికమా!
యనుకంప తొలంక న్నాశ్రు గీ
తికలను వేడికొందొ? కలదే
తెలియంగ వన ప్రియధ్వనిన్"

ఇందులో ఆంగ్లకవి ప్రసిద్ధ పంక్తి[1]: "కరుణారసోద్గార భావప్రకటన కావించేవే మా అత్యంత మధుర గేయాలు" ఎంతో భంగ్యంతరంగా ధ్వనిస్తుంది. ఆంగ్లకవి భావాలన్నీ ఆంధ్రకవి హృదయంలో పుటం పెట్టబడ్డాయి. కోకిల గీతాల్లో శ్రీకృష్ణుని మురళీ నినాదాలు వినాలని ఆశిస్తాడు కవి.

"ఈ భూలోకపు వాసనల్ని తిరస్కరించే కోకిలాలాపన పుస్తకాల్లో పొందుపడ్డ భావనిధులకన్నా, ప్రపంచంలోని సకల మనోహర నాదాల రాశికన్నా మిన్నగా" ఆంగ్లకవికి గోచరించింది. అంతేకాదు. తన ఆనందాతిరేక జీవన

---

[1] "Our sweetest songs are those that tell of saddest thought" 90th line, To a skylark.

ఈ సందర్భంలో రామాయణంలో బ్రహ్మ కావించిన ప్రబోధ వాక్యం సంస్మరించాలి.

"కురు రామకథాం దివ్యాం
శ్లోక బద్ధాం మనోహరామ్"

ప్రవృత్తిలోని అర్థమాధుర్యం తనకు ప్రసాదించమని అర్థిస్తాడు ఆంగ్లకవి.[1] ఇంకా శ్రుతిబద్ధమైన కోకిల భావోన్మాద గీతాలవంటివి తన నోటినుండి వెలువడాలని, అప్పుడు తన్ను ఆలకించినంత శ్రద్ధగా, కవినీ లోకం ఆలకించి ఆనందిస్తుందని ఆశిస్తాడు.[2] ఇటువంటి భావ తీవ్రత రాయప్రోలులో రాపిడి పడలేదు.

అయినా కోకిలారాధనాన్ని రాయప్రోలు విస్మరించలేదు. తన రమ్యాలోకంలో మొట్టమొదటే కోకిలస్వామికి ఇట్లా మ్రొక్కుతాడు — అభినవ స్వరకల్పన కుద్యమిస్తు. పైన పేర్కొన్న కొరత తీర్చాడు.

"మామిడి కొమ్మమీద కలమంత్ర
పరాయణుడైన కోకిల
స్వామికి మ్రొక్కి యీ యభినవ
స్వరకల్పన కుద్యమించితిన్:

---

1 Better than all measures
of delightful sound,
Better than all treasures
That in books are found,
Thy skill to poet were, thou scorner of the ground.
[96-100]

2 Teach me half gladness
That thy brain must know
Such harmonious madness
From my lips would flow
The world should listen then, as I am
listening now [101 – 104]

కోమల గోస్తనీ రుచులకున్
కదళీఫల పాక సిద్ధికిన్
లేములు దీర్చు మా తెనుగు
లేత ముదళ్ళ వెలార్చు వేడుకన్"

ఈ పద్యం ఎందరినో ఆకర్షించింది. అప్పటినుండి ఈయన 'కోకిలస్వామి' కవిగా ఖ్యాతిగాంచారు.

రాయప్రోలువారి యింటిముందు గున్నమామిడి చెట్టున్నది. లలితా నామ పారాయణానంతరం వరండాలో కూర్చోగానే కొమ్మమీద కోకిల కుహూకుహూ రావాలుచేసి తన్ను రచనకు ప్రేరేపించేదని చెప్పారు రాయప్రోలు. అదే తన గురువనేవారు. తనకేకాదు, అభినవ కవులకందరికి అదేగురువు. కోకిల వసంత ఋతువులోనే కూస్తుంది. నవకవులు ఉత్తేజితులైనప్పుడే కవితాలాపన చేస్తారు. నిత్యం రాయాలని, శతాధిక గ్రంథకర్తలు కావాలనే ఆగ్రహం వారికిలేదు.

పూర్వ కవుల్లో ఈయన వాల్మీకి కాళిదాసుల్నే స్తుతించాడు. అంతకు ముందు కోకిలస్వామికి అంజలించాడు. ఈ కోకిలస్వామి వాల్మీకి అని, ధ్వని మార్గంలో మీరు వాల్మీకికే అంజలించారని, తరువాత వాచ్యంగా స్తుతి చేసారని నేనంటే ఆయన ఆనందించి, 'నీవువట్టి వ్యాకరణజ్ఞుడవనుకొన్నానురా! అంత మాత్రుడవుకావ'ని ఆశీర్వదించారు. ఈపద్యంలో జీవమంతా 'కలమంత్రపరాయణుడ'నే మాటలో ఉంది. కవి భాష మనోజ్ఞమైన మంత్రంవంటిది. 'మననాత్ త్రాయతే ఇతిమంత్రః'. మననంచేసేకొద్దీ రక్షించేది మంత్రం. మననంచేసేకొద్దీ సహృదయుడికి నవనవోన్మేషమైన ఆనందాన్ని ప్రసాదించేది కవివాక్కు. కవి

వాక్కులోని రహస్యార్థాల్ని అంటే ధ్వనిని గ్రహించే వ్యక్తికి సరస్వతీదేవి ఆవిష్కృత అవుతుంది.[1]

మంత్రముగ్ధమైన కవిత్వాన్ని గూర్చి శ్రీ అరవింద యోగులు ప్రస్తావించారు.[2] వాల్మీకి అటువంటి కవి. కాళిదాసు రసాలంకార ముగ్ధమైన కవి. అందుకే వారిరువురినే స్తుతించారు శ్రీ రాయప్రోలు.

కావ్యతత్త్వానుశీలనం :— కవి ఎన్ని కావ్యాలు రచించినా అతనికి యశస్సు కల్గేది ఏదో ఒక్క కావ్యంవల్లనే. కొన్ని ప్రసిద్ధిని కూర్చవచ్చు. రాయప్రోలువారి పేరు చెప్పగానే జ్ఞాపకంవచ్చేది ఆయన తృణకంకణం.దీనికంటె ముందే 'లలిత' కావ్యం రచించారు. అది గోల్డ్‌స్మిత్ రచించిన 'హెర్‌మిట్' కావ్యానువాదం. అనువాదం అని చెప్తే తెలుసుకోటమే. అయితే ఈ కావ్యం ప్రబంధ ధోరణిలో సాగింది. వర్ణనలన్నీ కవి కల్పితాలే. వాటిలో జీవచైతన్యం తక్కువ.

---

1 "ఉతత్వః పశ్య న్న దదర్శ వాచమ్
ఉతత్వః శృణ్వో న్న శృణోత్యేనామ్
ఉతోత్వస్మై తన్వం విసస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః" ఋగ్వే. 10-71-4

వాక్కును దర్శించినంతమాత్రాన, విన్నంతమాత్రాన ప్రతివాడు దాని అంతరార్థాన్ని గ్రహించినట్లుగాదు. ఆత్మ సాక్షాత్కారంగల వ్యక్తికే వాగ్దేవి తన్నుతానావిష్కరించుకొంటుంది—ఎట్లా? వాసాలంకృతయైన అర్ధాంగి తన ప్రియతమ భర్తకు తన్నుతానర్పించుకొన్నట్లు.

2 "The 'mantra' in poetry, that rhythmic speech which as the Veda puts it, rises at once from the heart of the seer and from the distant home of the Truth". Sri Aurobindo's Future poetry p. 11.

'తృణకంకణ' కావ్యం వినూత్నధోరణిలో సాగింది. కథకు ప్రాధాన్యమే లేదు. నాయికా నాయకులే పాత్రలు. ఒకానొక పతాకస్థాయిలో ఇరువురు కలుసు కొని విడివడిపోతారు. పోయేటప్పుడు నాయకుడు పచ్చిగడ్డి పరకల్ని నాయిక మణిబంధానికికట్టి యిలా అడుగుతాడు :

"ఈ తృణ కంకణంబు ధరియింపుము
నీ మణిబంధమందు సం
ప్రీతిని నప్పుడప్పు వలపింపుల
నెయ్యము జ్ఞప్తిగొన్న ప్రా
భాతిక వేళ నీ ప్రణయ
బాష్ప కణాంజలి నింతయిచ్చి యే
రీతిని వాడకుండ నలరింపు
మిదే తుది వాంఛ సోదరీ!"

అనంతరం నాయిక 'వ్రేలివలపుటుంగరమును పెడలదీసి, ప్రియసఖుని కేలను నలంకరించి చనియె."

"వలపు నశియించియును ప్రేమ నిలువగలద
యేని కలనైన గలుమముకాని స్నేహ
మృదు మధురసానుభవరక్తి బొదలి మనము
నీడలట్టుల నైక్యముందెదము గాత."

ఆ తరువాత ఎవరిదారిన వాళ్ళు వెళ్ళారు. ఒండొరుల జూచుకొంటు వాళ్ళు విడివడ్డా వారి మైత్రీ ప్రేమపాశాలు మాత్రం తెగకుండా ఉన్నాయంటాడు కవి. ఆది మధ్యాంతంలో ఈ నూటపది పద్యాల లఘుకావ్యం భావ సంఘర్షణో పేతమై చైతన్యచకచ్చకితంగా సాగి అభినవ కవితకు శ్రీకారంచుట్టింది.

ఒకనాడు నాయిక తన పుట్టింటికి వచ్చింది. మధ్యాహ్నం రెండుమూడు గంటల ప్రాంతంలో తనతోటలోకి వెళ్ళింది ఆ తోటనిండా నారికేళతరులు,

పొన్నచెట్లు, వెదురుపొదలు, కన్నెగందపు మానులు ఉన్నాయి. అందులో ఒక బాలహరిణంగూడ వుంది. దాన్ని ప్రేమతో పలకరించి లాలించింది.

ఆమె ఒక సౌనప్రక్కనున్న పోకచెట్టు నీడన నిల్చి ఏమేమో ఆలోచిస్తున్నది. అప్పుడెవరో తనలో తాను మాటాడుకోటం చెంగటినుండి వినిపించింది. అతడు భగ్నమనోరధుడు. ఆమె చిననాటి నేస్తగాడు. ఇప్పుడతడు 'కందళితస్నిగ్ధరసోదయుడు'. 'బలవద్వియోగం చేత ప్రేమబంధాలు తెంచుకోటానికి అల్లాడి ఆకులు మేస్తున్నాడు'.

ఇరువురు ఒకరినొకరు చూచుకొని సమీపించారు. వారిది 'ఆజనన బద్ధ బాంధవమైన చనువు'. 'చిర సమ్మేళన కాంక్షావిచిత్ర రక్తి'. అందుచేత నేమో అప్రయత్నంగానే ఒకరిచేయి ఒకరు పట్టుకొన్నారట. నోటివెంట మాటరాలేదు. కొంతసేపటికి తెలివివచ్చి యౌవనుడాయువతి చేయి వదలిపెట్టి 'కుశలమా నెచ్చెలీ' అని పలుకరించాడు.

ఆమె సోగకన్నులు వికసించాయి. ప్రియునివంక చూచింది. అస్ఖలిత ప్రేమ తత్త్వరహస్యం విశదమయ్యేటట్లుగా హృదయవాద కౌశలంతో సంభాషించింది. "ఎందుకంత విరక్తి? రాగబంధాలు ఎందుకు తెంచాలని అనుకొంటున్నావు? సఖుల రాగబంధాలు అఖండాలని తెలేదా?" అని ఆమె విశ్వాస బాష్పసలిలధారలు నిండిన కళ్ళతో ప్రశ్నించింది.

అప్పుడాతని వచోగతిలో మనోనిశ్చయం ఇలా ఉద్ఘాటితం :

"బాలా! యేటికి మాటలెత్తి నను
నొవ్వంజేసె దింకేన్, వృథా
లీలా భ్రాంతి యటం చెఱుంగక
వ్యథాలీనుండనయితిం దుదిన్;
జాలున్ నెయ్యపు తీరు తీయములు
బాహ్యజ్ఞాన నిద్యార్థినై

కాలంబున్ వయసున్ వ్రయించెదను
సౌఖ్యంబౌను నిశ్శాంతిమై"

"చెదరిన శూన్య భావము
లిసీ! రుచియింపవు రక్తి లేమి నో
ముదిత! వియోగమం దమృతమున్
విషమూన్ సమవృత్తులేసుమీ!"

"సరస సాంగత్య సుఖ విలాసముల కన్న
దుస్సహ వియోగ భరమె మధురము సకియ!
బాధ లేక వ్యసనరుచి బోధపడదు
చీకటులు లేక దీపిక చెలగనట్లు"

ఈ నష్టప్రేమికుడు కడకు తన కథ 'సుకవి యక్షర జీవగీతిక' కావాలని కాంక్షించాడు. 'సకియ విశ్వాస బాష్పముల'తో తృప్తిచెందుతానంటాడు. తమ ప్రణయ రమ్య దినాలను మరవద్దని, ముగ్ధరాగ పరిణామ జ్ఞాన సిద్ధాంతాన్ని మరవద్దని, సాశ్రూక్తులతో అర్థిస్తాడు.

అప్పుడా స్నేహితురాలు, తన నేస్తగాణ్ణి క్రీగన్నులతో చూచీ చూడనట్లే చూచింది. గూఢప్రేమ లీలావినూతన విద్యా పరిపాటి తేటపడేటట్లుగా శాంత శ్రుతిలో ఇలా ప్రబోధించింది.

"మిత్రమా! ప్రేమబంధాలు తెంపితే తెగేవికావు. అందులోను అస్ఖలిత ప్రణయానురక్తి చిర తపశ్శుద్ధిచేతగాని దొరకదు. విషయ వాంఛలతో హృదయాన్ని కల్మషం కావించవాకు. తన్మయమైన యార్ద్రమానుషదశే కృతార్థమైంది."

"కలసిన యంత మాత్రమున
గాదుసుమీ! చెలికార, మంతరం
బుల సతుకంగ జాలిన
యపూర్వపు లంకెయె స్నేహమా తడ

స్ఖలిత సమస్త సాధనము
జ్ఞాన విదగ్ధుల మార్గసూత్ర, మే
వలతిని నైనట్రేమ పరిపాకము
లిట్టులె యన్వయించెడిన్"

"పరమ ధర్మార్థమైన దాంపత్య భక్తి
స్తన్యమోహానమైన వాత్సల్య సక్తి
సాక్షిమాత్ర సుందరమైన సఖ్యరక్తి
అందు ఆదిమమగు ప్రేమయందె ముక్తి"

గువ్వ జంటలు వలపుతోను, తల్లీ బిడ్డలు వాత్సల్యంతోను, మిత్రులు కలుషరహిత మైన సత్ప్రణయ కాంక్షల మేళనంతోను మెలగటంలేదా? ఎందుకు వికార భావాలలో పడ్డావు?

"మనసుచే, వాక్కుచేత, కర్మంబుచేత
కలుషితములు కాదగిన పీ వలపులవని;
తపసుచే, తాల్మిచే, ధ్యానధారచేత
లీనమై యైక్యమందజాలినది ప్రేమ".

అంతరంగాల్లో పెనవేసుకొన్న ప్రణయం మాసిపోయేది కాదయ్యా! ప్రేమ కలుపుతుందన్నా, విడదీస్తుందన్నా నిమిత్తమాత్రమే.

కామాని కతీతమైంది ప్రేమ. కామానికన్నీ బంధాలే. ప్రేమ కేసంకెల లేదు. ప్రకృతిలో నిండి నిబిడీకృతమైంది ప్రేమ.

"కనుల నొండొరులను జూచుకొనుటకన్న
మనసు లన్యోన్యరంజన గొనుటకన్న
కొసరి 'యేమోయి' యని పిల్చుకొనుటకన్న
చెలుల కిలమీద నేమి కావలయు సఖుడ!".

భావబంధంగా నా మణిబంధానికి చిన్నప్పుడు కట్టిన పట్టుతోరం. విస్మృతావా దీన్ని?" అని మాట్లాడలేక ఆమె కనులు వాల్చింది.

నూత్న విజ్ఞాన ప్రబోధితుడైన ఆ స్నేహితుడామె పాణితెమల్చి పలకాలని ఉంకించాడు. ఏమీ పలుకలేకపోయాడు. తరువాత తోరం తీసివేసి, కుల్యాంతంలో పెరిగే తరుణార్ద్ర తృణాంకురాన్ని గిల్లి వింత కంకణాన్ని రచించి తన స్నేహితురాలి మణిబంధానికి కట్టాడు— పరస్పర మైత్రీ ప్రతీకగా. ప్రభాత సమయంలో ప్రణయ బాష్పాలతో దాన్ని వాడనీయకుండా చూడమన్నాడు.

ప్రకృతి స్నేహబద్ధమైంది. ప్రకృతికి ప్రతీక తృణం. వారిరువురిస్నేహం నిత్యకళ్యాణం, పచ్చతోరణంగా సాగిందని భావించాలి.

ఈ చిన్ని కావ్యానంతరం ఏకావ్యం రాయకపోయినా రాయప్రోలు వారికి నవ్యకవితా పీఠంమీద అగ్రస్థానం ఉండేది. దీన్నే మహాకావ్యంగా విరచించ వచ్చు. కాని నవ్యలోకం ఆ భారాన్ని వహించలేదు.

ఈ కావ్యాన్ని కూడా నిరసించేవాళ్ళున్నారు. ఇది దుస్వాధమని అసహజ మైందని విమర్శిస్తారు. ఇది మానసిక వ్యభిచారం కాదా? అని ప్రశ్నించే విజ్ఞులు లేకపోరు. మనిషిలో కావలసినంత పశుత్వముంది. కావలసినంత మానవత్వము ఉన్నది. మానవత్వంలోని మహిత మాధుర్యాన్ని వెలార్చటమే భారతీయ సాహిత్యాశయం. పూర్వం కాళిదాసాది కవు లలాగే చేశారు. రాయప్రోలువారు ఆ కోవలో నవ్యుడు.

మానవునిలోని కాముకత్వాన్ని, ప్రచ్ఛన్న పశుత్వాన్ని ఉన్మీలించే నవల లెన్నో వెలువడుతున్నాయి. అవి చదివి ఆనందించేవాళ్ళు అధిక సంఖ్యలో ఉంటారు. వారి కిట్టి కావ్యాలు రుచింపక పోవచ్చు.

ఆయన ఈ కావ్యం రచించిన కాలానికంటే, ఈనాడు తృణకంకణానికి ఎంతో విలువవుంది. కాల పరిణామంలో విలువ పెరిగే కావ్యాలే చాలా గొప్పవి. ఈ నాడసంఖ్యాకంగా స్త్రీ పురుషులు కలసి మెలసి విద్యనభ్యసిస్తున్నారు. వివిధ సంస్థల్లో ఉద్యోగాల్ని నిర్వహిస్తున్నారు. స్వేచ్ఛావాయువులు పీలుస్తున్నారు. అనారోగ్య కార్యోన్ముఖులౌతున్నారు. అటువంటివారికి కావ్యం, మైత్రీబంధంతో

ఆరోగ్యవంతంగా జీవించమని కాంతాసమ్మితోపదేశం చేస్తుంది. కేవలం కామంతో కొట్టుమిట్టాడే యువతకు యాభై శాతం విజయంకాక, నూరుశాతం విజయాన్ని చేకూరుస్తుందీకావ్యం.

మగవారిలో ఇప్పుడధికసహనం కావాలి. తనకు స్నేహితులున్నట్లుగానే, ఉద్యోగినియైన తన భార్యకు స్నేహితులుంటారు. వాళ్ళతో మైత్రీపూర్వకంగా ప్రవర్తిల్లితే, 'ఏమోయ్' అని పలకరిస్తే సహించగలగాలి. అనుమాన సంకుచిత స్వభావాలకు స్వస్తిపలకాలి. అటువంటి మహాశయంతో భవిష్యద్దర్శనంతో రాయప్రోలువారు రమ్యాతిరమ్యంగా రచించిన ఈ 'తృణకంకణం' స్నాతక, స్నాతకోత్తర తరగతుల్లో నిత్యపఠనీయమైన కావ్యంగా విరాజిల్లాలి. భావ విప్లవం సాధించాలి. ఇది ఏటికెదురీత. వాలుగా అందరు కొట్టుకుపోగలరు. స్త్రీని సోదరిగా ప్రేమించటంలో మానవ సంస్కృతంతా మూట గట్టుకొంటుంది. కవి అటువంటి సంస్కృతిని చేకూర్చటానికే ఈ సత్కృతి రచించాడు.

పదునాలుగేండ్ల అమ్మాయిద్వారా రాయప్రోలువారి ప్రేమతత్త్వాన్ని రామణీయకంగా ఉన్మీలించారు. "ప్రత్యుత్పన్నమతి స్త్రైణమితి యదుచ్యతే" అని దుష్యంతుడు సస్మితంగా అన్నా అది సత్యసమీచీనమే. "స్త్రీణామశిక్షిత పటుత్వమ్" అనే దుష్యంత వచనం స్మరింపదగిందే. రాయప్రోలువారి రమణీ మణులందరు పచేళిమమైన మనస్సులు గలవారే.

*   *   *

'తృణకంకణం' తరువాత గుణంలో చెప్పుకోదగింది 'కష్టకమల' - ఇది విషాదాంత కావ్యం. పిన్నిచెప్పిన యథార్థ కథనే మథించి, మదించి కవితా రామణీయకంగా ఇలా సవదరించాడు కవి. వెదుళ్ళపల్లి గ్రామీణ రుచిమదమల వాతావరణం పూర్వకావ్యంలోలాగానే యిందులోను అక్షరరమ్యమైంది. ఇప్పటికే ఇటువంటి గ్రామీణ వాతావరణం భారతదేశంలో నశించిపోతున్నది. దాని నిరాడంబరత్వాన్ని, నిస్తుల భావ సౌందర్యాన్ని స్మరింపచేస్తున్న కవికి జాతి ఋణపడి ఉంటుంది. కావ్యాన్ని సహృదయులొక్కమారు, ఇంకొక్క మారు చదివితే కవిఋణం వడ్డీతో తీరుతుంది. కవి ఆత్మ ఆనంద తరంగిత మౌతుంది.

'కమల' 'వసంతు'ని యేకపుత్రిక. కమల మేనత్త 'పూర్ణ'. 'కుమారుడు' పూర్ణ పెంపుడుకొడుకు. కమలా కుమారుల సాహచర్యం అవిచ్ఛిన్నం. వారిరువురి ప్రణయానురక్తి పుష్పించలేదు.

కుమారుడు విద్యాస్నాతుడు కావటానికి ప్రవాసి అవుతాడు. ప్రణయానురక్తుడై కమలకు ప్రణయలేఖ వ్రాస్తాడు. ఆ లేఖనందుకొని కమల చదువుకోటానికి ఉద్యమించటంతో కవి తన రచనను ప్రారంభించి ఉత్కంఠ నెక్కడా సడలనీయకుండా చదివింపజేస్తాడు.

కమల ఉత్తరం చదివిందోలేదో పూర్తిగా. కాని దాని అంతరార్థం కమల గ్రహించింది. అంతరంగం కలత చెందింది. ఇంతలోకే ఎవరో పిల్చారు దాన్ని ఇసుకదిబ్బలో దాచింది.

మేనత్త దగ్గర కాసేపున్నది. ఆమె మొగంలో కసికాటులువడ్డ మనోవికారాలు గోచరించాయి. ఆమె 'పెన్నరుల్ పాయక కాలసర్పము నెపాన నిజాంసములన్ పెనగొన్న వ'ట. ఇదియద్భుతమైన భవిష్యత్సూచన.

కరుణ రసాన్ని పోషించటానికి మధ్యలో అజవిలాప ప్రస్తావన చేయిస్తాడు కమలచేత మేనత్తకు. తోటలోకి వెళ్తారు. పిన్నతీవ చెల్లెండ్లను చూపుతానంటుంది. ఏదో కలతపడ్డట్లు కమల కనిపిస్తుంది. పూర్ణ అర్థంకాక తపిస్తుంది. శోషపోయి కొంతసేపటికి తేరుకొంటుంది. చివరకు **"అత్తరో! అవి** మిత్తపు వ్యధలకేను పాలయితి నేడు, మిమ్మను పాలుచేసినాను, క్షమియింపుమెంత విహీనమతినా" అంటూ రహస్యమైన ప్రణయలేఖను వినిపిస్తుంది — అత్తతోపాటు ప్రకృతికూడా ఆలకిస్తుంది.

"వలపులు పొంగగా పొడుపు
వాకలలోని జలంబువోసి, మి
త్రులగతి బెంచికొన్న చిగురుం
బువు గొమ్మల నెల్లడాసి యో

చెలువల చందమామరో!
వచింపుము నా ప్రణయంపుటప్పగిం
తలను, ప్రవాస వాసములు
దారుణాద్వైవిక పాత్రముల్గదా!"

ఇది లేఖ సారాంశం. ఇంతలో ప్రొద్దుగ్రుంకింది. ఆరాత్రి అంతా గోరంట్ల ముచ్చట్లు. తెల్లవారితే తద్దెపండుగ ఉయ్యాలలూగాలె. తల్లి కమలను సాలంకృతను చేసింది. తోటలోకి పంపింది. అప్పుడామె 'పిరుదలను రాయు వేణీభరము సింగారమునకొక వన్నె' చేకూర్చింది.

అన్యమనస్క అయిన కమల ఉయ్యాలెక్కి ఊపమన్నది ఊపులతిశయించాయి. చుక్కల్ని తన్నుతుంది. కన్నెలు భయభ్రాంతలైనారు.

"ఆ యుయ్యాలయు రివ్వురివ్వున నభం
బంటంగ పైకేగు చే
మోదై గిర్రున క్రిందకున్ సుడివడెన్,
పూబోణి వేణీభరం
బాయూపుత్వడి కంఠమన్
డుఃరి వేయన్ మార్మోడంబెట్టి చే
దోయిన్ లంకెలవడ్డ త్రాళ్లనడుమన్
తూగాడె నయ్యోవిధీ!!"

అందరు గొల్లుమన్నారు. కమలవేణియే ఆమెపాలిటి కాలపాశం.

ఇందులో పురుషుడు స్వార్ధబుద్ధితో వివాహానికి తాను తొందరపడి, ఎదుటివారిని తొందరపెట్టి ఎట్లా కష్టపెడతాడో కవి రమ్యంగా నిరూపిస్తాడు. పరమ పవిత్రమైన సోదరభావాన్ని పురుష కాముక చిత్తం చిత్తుచేస్తుంది. స్త్రీ అందుకాయత్తం కానప్పుడు ఈ ఘాతుక భావానికి చిత్తయిపోతుందనే స్వభావ మథనాన్ని మధురాతి మధురంగా ధ్వనింపచేస్తాడు కవి.

ఆధునిక కాలంలో కొంత తగ్గుముఖం పట్టినా, ఆడపిల్ల పుట్టంగానే వివాహసంబంధాలు అంటగిట్టి ఆనందిస్తుంటారు వృద్ధులు—వనిపాటలు లేకుండా. ఆ భావాలు లేతమనస్సుల నెంతగానో బాధపెడతాయి.

కావ్యం రాశిలో గొప్పదనం వహించటంకాదు వాసిలో గొప్పదనం కావాలి. ధ్వని ప్రధానమైన కావ్యం ఉత్తమోత్తమని అంగీకరించాలి. ఇందులో వ్యక్తిగతమైన అభిరుచికవకాశమేలేదు. కష్టకమలలో ధ్వనిని చక్కగా పరిపోషిస్తు తన కవితా రామణీయకాన్ని తీర్చిదిద్దాడు కవి. శ్రీ సుకుమార మనః ప్రవృత్తిని సూక్ష్మ సుందర సురుచిర కవితా ఫణితిలో అందించాడు.

కురంగ సౌందర్యాతిశయమే దాని మరణానికి హేతువు. కమల వేణీభారమే ఆమె కంఠానికి ఉరి అయింది. పైపద్యం చదువుతుంటే మన మనోనేత్రముందు పైకెగిరిన ఉయ్యాల సుడితిరిగి వేణిభరం కంఠానికి ఉరికావటం భావ చిత్రం గీసినట్లుగా నిగడితమౌతుంది. ఈ శైలిలోని పొందిక ఆవిధంగా అర్థస్ఫోరకం (Sound echoing the sense)

ప్రత్యక్షోపదేశం లేకపోవటం ఈ కావ్యంలోని గొప్పగుణం. విషాదభావ శబలిత కవితాగాన మాధుర్యాన్ని ఆస్వాదింపచేసే ఈ కావ్యం ఎన్నిసార్లు చదివినా ఇంకా చదవాలనే అనిపిస్తుంది. ఇందులోని భావనిధుల్ని చదివేకొద్ది సహృదయు డావిష్కరించుకోగలడు

* * *

పురుషుడికి ఆడది కనిపిస్తే చాలు, ఏవిధంగా కాముక ప్రవృత్తి వ్యక్తమౌతుందో సుకుమారంగా వ్యక్తంచేసేది "స్వప్న కుమార కావ్యం". స్త్రీ స్వాధీనుడు పురుషుడని మృదువుగా హెచ్చరిస్తాడు కవి.

"పూలు గ్రుచ్చిన సంపూర్ణ పుణ్యశీల
వేని ననుజూచి కామింపు మిందువదన!
మాలికలు గ్రుచ్చిన ఈ భాగ్యారాల వేని
నిమ్ము పాదము పాతమనోరథుల మగుచు".

ఒంటరిగా క్షణముండలేడు. స్త్రీ విరహాన్ని సహించలేడు. ఎవరైనా, ముక్కు మొగం తెలియకపోయినా 'సాప్తపదీనమైత్రి'కి సిద్ధపడతాడు. కన్నతల్లి ప్రేమను కాలరాస్తాడు. పెంపుడుతల్లి యార్తి అతనికి లేబరమే. కాని ప్రియురాలి మోహాన్ని మాత్రం విస్మరించలేడు పాపం

"వలపుతీపులనైన, నెవ్వగలనైన
ప్రతినిరతినైన, ప్రణయప్రపత్తినైన
నీ కుమార దీనుని తోడ నించుకంత
పాలుపంచుకోగలవేని పలుకు మబల

అని అర్ధరాత్రి కనిపించిన వనిత నర్థిస్తాడు. ఆమె మాట్లాడకపోతే వెంట పడతాడు. ముసుగుతీస్తాడు. మోమివ్వమంటాడు. "మనసీయక మోమునిచ్చు చలినలు కలరే?" అని ఆమె ఛీదరించుకొంటుంది. పాశ్చాత్య వ్యామోహ జీవన విధానానికే నిరసనమిది.

కుమారుని దైన్యాన్ని గ్రహించి, ఆ కాంత విరహ ప్రాముఖ్యాన్ని అనేకరీతుల ప్రకృత్యుదాహరణలతో ప్రబోధిస్తుంది:

"మౌక్తికముల కానుపు మోయు శుక్తికకట!
గర్భవిచ్ఛేదమేపాపకారణంబొ?
పక్వఫలములు గన్న రంభల కదేల
తప్పదు సమూల నాశనత్వము కుమార!!"

"కారు చీకట్లు లోకమున్ కప్పెననుచు
ఏల నిదించెదవు మేఘమాలికలను?
చూడగలవు గదోయి భాసురములయిన
చారుచపలాలతల, ఇంద్రచాపరుచుల"

ప్రకృతిలో సుఖదుఃఖాలు, ఆశానిరాశలు, ఎలా ఉన్నాయో కవి రమ్యాతి రమ్యంగా హృదయాలకు హత్తుతాడు.

ప్రకృతిలోని మమకారాన్ని ఎలా మనోజ్ఞంగా ప్రదర్శిస్తాడో చూడండి

"దప్పిగొని చేరిన మిళింద తనయులకును
పూలపాలిచ్చి చీకట్ల పోకుండ
కడుపులో దాచుకొనదె పంకజము ప్రియుడ!
చేరదీసిన మమకార మేరికెఱక?"

ఈ మాతృభావం అపూర్వంగా భావుకుల్ని బాగా అలరించింది[1]. కవికికూడ దీనిమీద మక్కువ ఎక్కువ. దీన్నే భంగ్యంతరంగా ఇలా అంటాడు :

"సందెలను దారితప్పు మిళింద సుతుల
తేన పాలిచ్చి చీకట్ల దిరుగనీక
ఉదయమగుదాక యొడిలోన నిదురబుచ్చు
చేరదీసిన మమతకు చిక్కె నళిని"

ఈ భావాన్నే రమ్యాలోకంలో నవ్యకవుల భావనలోని విశిష్టతకిలా ఉదాహరిస్తాడు

---

[1] "ఇది అపూర్వ విషయము. ఏ లాక్షణికులును, కవులును ఈ సంబంధ మూహింపలేదని డాక్టర్ నారాయణరెడ్డి వక్కణ. (చూ. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు — పుట 302 : 1967 (వ.ము.) ఇది అపూర్వం కాదని, తెనాలిరామకృష్ణుడు తన పాండురంగ మాహాత్మ్యంలో పుష్పభ్రమరాలకు మాతాపుత్ర సంబంధాన్ని ఊహించి నూతన కవి సమయాన్ని నెలకొల్పాడని శ్రీ కె. వి. రాఘవాచారిగారు "కవి సమయాలు — క్రొత్త ప్రయోగాలు" అనే తమ భారతి (1978) వ్యాసంలో ఉద్ఘాటించారు. ఇంతకూ ఆ పద్యం :

"దామోదరుడు యశోదా స్తన్య మానెడు
నని ముక్కు విరిగుత్తి నళి భ్రమింప" (V—299)

ఇంకెక్కడైనా సకృత్తుగా ఇలా ఏ కవైనా ప్రయోగించాడేమో? వాఙ్మయ మంతా ఈ దృష్టితో చదవాలిగదా!

"తీవెమీాద సుతారంపు తీవి నిలిచి
పగులబడి నవ్వు పువ్వు పైకెగయు అళిని;
ప్రియుడు ప్రియురాలినట్లు చేర్చె నొక సుకవి
బిడ్డతల్లిని భాతి కల్వె మరొకండు"

శృంగార భావన ప్రాచీనులకిష్టం. మాతృ శృంగారం నవీనులకిష్టం.

ఎన్నో ప్రకృతి గత రహస్యాల్ని కవి ఆ వనితాముఖాన వివరిస్తాడు. ఆ పద్యాలన్నీ మంత్రాలలాగా మననం చేసుకొని ఆనందించదగినవి

అయితే ఆమె చివరికిచ్చిన సందేశమిది :

"ఎంత కామింతో దుఃఖంతువతిచేటు
ఎంత దీపమో నీడయు నంతెకాదె!
పరిమితియు ననుబంధమున్ సరిసమంబె
ప్రేమ పెనచు నేడుపు నింక విడువనేల!"

కుమారునకు "భగవతీ ప్రకృతి స్తిమిత స్వరూపం" కనిపించింది. ఈ కావ్యం ఆ మూల చూడంగా భావ రమణీయమైంది. స్వచ్ఛమైన కవిత.

* * *

ఇంకో విషాదాంత లఘుకావ్యం 'స్నేహలత'. ఇది వంగదేశంలో వాస్తవంగా జరిగిన ఉదంతం. జ్వరగ్రస్తుడై పత్రికాముఖాన చదివి ఎంతగానో స్పందించి కావించిన కావ్యసృష్టియిది.

నాటకంలో నాందిలాగా భవిష్యత్సూచనతో కావ్యమిలా ఆరంభం :

"నిత్య సంధ్యాకుమారీ మణీమతల్లి
కట్టుచీర చెరంగులు కాలుపోల్కి-
అస్తగిరి మస్తకమున సన్న్యస్త కాంతి
కాయుడగు సూర్యభగవాను చాయలలమె"

స్నేహలత పుట్టిల్లు పూరిల్లు. అందులోను 'ప్రాబడిన యాకులయిల్లు'. అయినా సముపాంత వృక్షంవల్ల నిసర్గ శోభామయం. లోనికి ప్రవేశిస్తే 'విశుద్ధ గోమయ స్ఫురిత సుగంధం'. [నిన్న మొన్నటి వరకు మనలో చాలమందికి ఇటువంటియిండ్లే ] నికటంలో రావిచెట్టు. దానిమీద 'అపూర్వశోకహాతి విలాపించే విహంగమొకటి', ఇదీ విషాదసూచనే. పాఠకునకు భావప్రేరణ కల్గిస్తుంది.

డబ్బు కొరతవడ్డా ప్రేమకు కొరతలేదు. 'నడచిన కందిపోవు చరణమ్ము లటంచు తపించుచుందురాబిడ్డ తల్లిదండ్రు లెప్పుడును'. 'విచ్చినపుష్పమువోలె బుట్టె, వంగడమునకెల్ల సౌరభముగా నయగారి కుమారి! ఎత్తిడించెడు సతి మెప్పుతో 'స్నేహలతా!' అని చిన్నప్పుడు పిలిచిందే. అదే రూఢమైంది. అదే చిత్రం. ఈ లతకు సరైన ఆశ్రయం లభించలేదు. ఆశ్రయ మివ్వటానికి లంచం అడిగారు. స్నేహాన్ని కోరలేదు. అప్పుడు తన స్నేహంతో భావాగ్ని రగిల్చి ఆహుతి అయింది స్నేహలత. సహృదయ హృదయాల్ని సోదరస్నేహంతో అల్లుకొన్న శాశ్వత భావలతకు త్యాగగరిమ చేకూరింది.

తన తండ్రికెదురైన సమస్యను గ్రహించింది స్నేహలత. పుట్టింటికి చిచ్చుపెట్టి మెట్టినింటిని వెలిగించటం సంస్కృతి కాదనుకొన్నది. 'అపాత్రపు వియ్యం' క్షేమం కాదనుకొన్నది. ఇట్లా ఎన్నో జరిగాయి. అవన్నీ విషఫలాలనే సమకూర్చాయి. గంగాతీరంలో కూర్చొని తనప్రాణసఖి ప్రియంవదతోపాటు స్మరించిందీ విషయాలన్నీ స్నేహలత. దేశమాత ఏస్థితిలో వారికి గోచరించిందో చూడండి :

"పంక నిర్మగ్న కంఠమౌ పాడియావు
పగిది నున్నది ఋషులున్న భరతభూమి;
కంటకంబులె పెరుగు దుష్కాననముల
పూలచెట్లెండిపోవు టబ్బురము కాదు".

లోకమంతా సుప్తి మూర్ఛపాలైంది. స్నేహలత లేచింది. తనవల్ల అమ్మ, నాన్న, ముద్దుకూనలు 'దీర్ఘ నిదాఘ తాప బహుళ దారిద్ర్యవారాశి' వడి మునిగిపోరాదని నిశ్చయించుకొన్నది.

"భరత జనయిత్రి సుకృత తపఃఫలమ్ము
లన నుదయమైన యువజను లక్కటకట!
అధమ పురుషార్థమనక కన్యల వరింప
శుల్కముల కుప్పిళులనూరు శూరులయిరె!"

అని ముక్కుమీద వ్రేలు వేసుకొన్నది. ఈ దురాచారాన్ని ఎవ్వరు ఖండించరు సరిగదా! నిమ్మకు నీరెత్తినట్లు మిన్నకుండటం సహించలేక ఇలా ప్రశ్నించింది :

"కన్నియను పెండ్లియాడునో! కన్నతండ్రి
యర్పణము సేయు శుల్కదివ్యాప్సరసను
పెండ్లియాడునో యకట! యీ పెండ్లికొడుకు!
అడుగరే యొక్కరయిన నీ యార్యసుతుల!

"నరత్న మన్విష్యతి, మృగ్యతే హి తత్" అని కాళిదాసోక్తి[1]. రత్నం 'నన్నెవరు ధరిస్తారా'యని యన్వేషించదు. ధరించేవారే రత్నంకోసం అన్వేషిస్తారు. కన్యారత్నం కూడా అంతే. అన్వేషింపబడుతుంది. ఇది భారతీయ సంప్రదాయం. పశువుల్ని సంతలో కొనుక్కున్నట్లుగా వరుల్ని కొనటమేమిటి? స్నేహలత ఎంత తీవ్రంగా ప్రశ్నిస్తున్నదో చూడండి :

"పశుసమాజమైన పురుష స్వభావమిట్లు
పావన స్త్రీ కళాభాగ పదవి నింత
నిరసనోన్మాద దృష్టి గణింపకున్న!
ఋషి మహాదర్శముల నన్వయింత్రె యిట్లు!"

ఎంతోసేపు భావమథనం కావించుకోని, తండ్రికో లేఖ ఇదివరకే రాసిందక్కడ పెట్టి తన్నుతానగ్నికి పూర్ణాహుతి కావించుకొన్నది — స్నేహలత.

అప్పటి స్నేహలతాస్థితి నభివర్ణించటంలోనే కవితా రామణీయకం అలరారుతుంది. కథ చెప్పటం నాయనమ్మకూడా చేతవుతుంది.

---

[1] కాళిదాసుని కుమారసంభవ కావ్యం — V — 45 శ్లో

అగ్నిహోత్రంలో స్నేహం పోస్తే జాజ్వల్యమౌతుంది. రాకరాక వచ్చిన బిడ్డను తండ్రి ఎగసి కౌగిలించుకొన్నట్లుగా స్నేహలతను అగ్ని ఆలింగనం చేసుకొన్నది. దహనులోనున్న స్నేహలత విరియు చంగల్వపూవుల కొలనులో కులికే రాయంచకన్నియకాదమో అన్నట్లుగాను; తామ్రపర్ణి నవారుణోదకంలో పొదలే తెలి యాణిముత్యాల బొమ్మో అన్నట్లుగాను; మామిడి చిగుళ్ళ సెజ్జమీది ధవళోత్తరీయమా అన్నట్లుగాను; పండుపగడాల రాశిలోబడి భ్రమించే నిండు జాబిల్లి రేకా యన్నట్లుగాను; లిఖిత కుంకుమ రంగవల్లికల నడుమ తీర్చిదిద్దిన కర్పూరవేదికా అన్నట్లుగాను; జ్వలితమైన మహౌషధీచయనంలో జాలువారే సోమక్షీర సారణా అన్నట్లు; ప్రజ్వలించే జపారక్తపాదపాల సందిట ముత్యాలు పూచే కాంది(?) అన్నట్లు పరిపరివిధాల కవి తన భావ పరిశుద్ధవీధిలో పరిభ్రమిస్తాడు. ఈ ఉత్ప్రేక్షల్లో కవి వైదికాచార సంపత్తి, ప్రకృతి పరిశీలనానురక్తి ధ్వనిస్తాయి.

ఇక లత తండ్రికి రాసిన జాబు నేటి ఆడపిల్లలందరు ఆదరంతో చదువుకొని మురిసిపోవాలి. తల్లిదండ్రులు గుండెలకు హత్తుకోవాలి. మగపిల్లలు చదువుకొని సిగ్గుతెచ్చుకోవాలి. ప్రతి పద్యం హృదయాన్ని మథిస్తుంది.

"లలిత లతవలె నీయురఃస్థలము నెనసి
మురియు ననుపెంచి తల్లారు ముద్దుగాగ;
కలలగూడ నాసౌఖ్యమే కలవరించి
కొల్లవెట్టితి నీప్రేమ కూర్మి తండ్రి!"

అంటుంది. ఆడపిల్లను తండ్రిఎలా అల్లారుముద్దుగా పెంచుతాడో అనుభవైకవేద్యం. కవికీ నలుగురాడపిల్లలున్నారు.

"రాజరాజ కుమారికా రత్నములును
అనుభవింపకు నేను పొందిన సుఖమ్ము"

ఏమి ఆమె పుట్టింటి అభిమానం? మగపిల్ల లెంతపెట్టినా పెట్టలేదనేవాళ్ళే. గోరంత పెట్టినా పుట్టింటివారు, కొండంతలుగా చెప్పుకుంటారు ఆడపిల్లలు. ఇది ఆర్ష సంస్కృతి.

తనకు పెండ్లి చేయలేదని సంఘంవల్ల తండ్రి పొందిన నిందల్ని స్మరించింది. భారతీయ యువజనంలో ఆనాడున్న త్యాగవిరతిని యిలా ప్రశంసిస్తుంది.

"మాతృ దేశాభిమాన ప్రమాణ బుద్ధి
చేకొని విదేశ వస్తువుల్ తాకమనుచు
భరతపుత్రకు లెందరెందరో వ్రతంబు
లూనినారంచు వింటి నత్యుత్సుకతను"

అటువంటివారి రీతిగా కట్నాలకమ్ముడుపోవటం శోచనీయమంటుంది లత.

ఈ సందర్భంలో కనకదుర్గాంబా ప్రస్తావన వస్తుంది.

"పుడమిని కడలిని మును పె
న్నడు చూడని యొక్క కాంతి నవనవకము పెం
పెడరక దర్శించితి నా
నడుమను వెలుగొందు శ్రీ కనకదుర్గాంబన్"

ఆమె ఆహ్వానించింది. లత ఆమెలో లీనమైంది. వంగీయులు దుర్గాదేవీపూజా ప్రపూతోత్సాహులు. ఆంధ్రులు శ్రీ విజయవాడ కనకదుర్గాభవానీ భక్తులు. ఆమె పాదసన్నిధిలో జరిగే ఈ సాహిత్య సమారాధనం ఆమెకు సమాదరణీయమౌతుంది. ఈ కావ్యం చివరి పద్యమే మన మనోనేత్రాభిరామోజ్వలంగా ముగిసిన ఈ విషాద నాటకానికి

భరతవాక్యం

"అఘమసిసల్క కలంకము నంటకుండ
నా పవిత్ర దీక్షాకన్యకా పథంబు
రక్షణము చేసినట్టి యీ దక్షిణాగ్ని
కలుషితాచారములు కాల్చి వెలుగుగాక!!

* * *

రాయప్రోలువారి దేశభక్తి కవితారామణీయకం ఆబాల గోపాలం కుతూకంటిగా ఆస్వాదించిందే. అందరు ఆ గీతాలు, పద్యాలు హృదయాలు విప్పి

చదువుకోని సదయులైనారు. అవన్నీ వాచ్యార్థప్రధానాలే. ప్రబోధాత్మకం కావటంచేత ఉత్తేజపరుస్తాయి. కాని 'తెనుగుతోట' గీత మాలికాఖండాలు రాయప్రోలువారి అపూర్వసృష్టి. ధ్వని ప్రధానమైన అత్యుత్తమ కావ్యం. స్వాతంత్ర్యం రావటానికి మూడు దశాబ్దాలకు పూర్వమే ఈ కవి రమణీయ భవిష్యత్క్రాంతదృష్టితో విరచించిన కావ్యరాజమిది. దేశాన్నొక తోటగా సంభావించారు.

జాతి గ్రామీణ వాతావరణాన్ని వీడి, వ్యామోహాంధకార దృష్టితో పట్టణాలకు, నగరాలకు ఎగబాకుతున్నది. స్త్రీలోకం మాతృత్వాన్ని అంగీకరించటానికి వెనుకంజ వేస్తున్నది. మన నోములు, వ్రతాలు మూలబడ్డాయి. కుప్పెలు పెట్టుకోని జడలల్లించుకోటానికి, కన్నెలు సిగ్గుపడుతున్నారు. అవన్నీ సముద్ధరింపబడాలని, సౌందర్యార్చన కొనసాగాలని కవి తన ఉత్కంఠను వ్యంగ్యమార్గంలో సూచిస్తాడు.

వృద్ధులు నవయువతాభ్యుదయాన్ని ఆకాంక్షించాలని ఇట్లాధ్వనింపచేస్తారు:

"వృద్ధతరులు లే మొలకల పెంపుజూచి
అభినవ వికాస దీవన మభినయించు"

ఆకాశంలో పాతమబ్బులు విచ్చిపోయాయి. క్రొత్తమబ్బులు అలము కొంటున్నాయి. కోకిల కుమారులు మంగళోక్తులాలాపిస్తున్నారు. స్వాతంత్ర్య జ్యోతిని దర్శింపజేస్తాడీరీతిగా :

"చీకటి ముసుంగుతీసి హసించుచున్న
దదిగో! మంచుల తెరలకు నవల నిలిచి
ఒక పవిత్ర తేజోబింబ ముజ్జ్వలముగ;
చూడబోవుచునున్నారు తోడి చెలులు
ఆలసించిన నిలువరు హర్షమతులు".

తమదేశ సౌభాగ్యాన్ని తాము అనుభవించటానికి లేకుండా పాశ్చాత్యులెలా చేసింది చిలకమర్తివారు చెప్పిన ఈ పద్యం ఆరోజుల్లో అన్ని గోడలమీద రైళ్ళలోను, ఎక్కడబడితే అక్కడ విరచితం, అందరినోట ఇదేపద్యం.

"భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారును గడసరి గొల్లవారు
పితుకుచుండిరి మూతులు బిగియగట్టి".

ఈ పద్యాన్ని స్ఫురింపజేస్తు ఇంతకన్న ధ్వనిప్రధానంగా శ్రీ రాయప్రోలు ఇలా అంటారు.

"తల్లిపాల్ త్రావకుండ బందాలబడిన
వత్సములు లాగులాడెడు పాలకొరకు
ఆలకొట్టాల పెండెము అవల నెట్టి
మెడల వేసిన పలుపులు విడవరమ్మ"

స్వాతంత్ర్యం వస్తున్నట్లూహించి :

"తల్లిపాలు త్రావిన మహోత్సాహపూర్తి
పెనగి చెల్లాటలాడెడు బెదరకడరి
ఇరుగుపొరుగు లేగల పెంపులరయువమ్మ"

అని ప్రబోధిస్తారు.

స్వాతంత్ర్యోదయానికి పూర్వపు ఉషఃకాంతుల్ని ఆయన సందర్శించారు. (చూ. ౧౦ ఖండిక) స్వాతంత్ర్య నౌకాయాత్ర సాగించారు. (చూ.౧౩ ఖండిక) 'మాతృపూజా ముహూర్త మేమరవద్ద'ని హెచ్చరించారు.

గ్రామాల్లో పొలాల్లో కష్టించి పనిచేయవలసినవాళ్ళు పని మానేసారు. పొలాలమ్ముకోని నగరాల్లో హోటళ్ళు నడుపుతున్నారు. ఈ విషయాన్నెంతో మనోజ్ఞంగా ఇలా సూచిస్తారు :

"వతములు త్రొక్కిదొంగుపు సీరెత్తువార
లన్యరతులైరి ప్రాల్మాలి యక్కటకట"

అట్టడుగున ఆదరంలేక పడివున్న అస్పృశ్యుల్ని గురించి కవి హృదయం ఎం
శ్రుతిహితంగా స్పందించిందో!

"అల్లులేక యథోగతియందు గ్రుంగి
జాతిమారిన నిమ్న సంజాతమెల్ల
తాకరాదని విడిచిరి దైన్యమునకు,
పరిమళములకు వెలియైన ప్రాణలతల
జీర్ణమయిన తోటల కాపు పూర్ణమగునె!"

ఇలా వ్యంగ్యధోరణి సాగించలేకకాబోలు, ఈ యదార్థాన్నిలా వాచ్యంచేస్తారు:

"అడ్డమైన చెట్టుల నీడ లవల బోవ
వెలుగు ప్రసరించవలయు వివేకశీల!
ప్రేమవృత్తికి చండాల భేదమేల!
బ్రాహ్మణాగ్రహారమునందు పవలు రేలు
విసరు పవనుడు కడజాతి వీటియందు
తాకలేక వీచునె పక్షతంత్ర జడిమ!"

స్త్రీలను గృహపంజరాల్లో బందీలను చేయవద్దంటాడు కవి.

"పంజరంపు నిర్బంధాల పాలుసేయు
శుక కుమారీకలమ్మలన్ చూడవమ్మ
.... .... .... .... ....
చెరలు విడిపించి తోటల స్వేచ్ఛగాగ
తిరుగ బంపుము చిలుక ముద్దియల నెల్ల

ఇట్లా ధ్వనిప్రధానంగా ఈ కావ్యాన్ని మనోజ్ఞంగా నడిపించి రసజ్ఞుల్ని
ఆనందపరుస్తాడీ కవీశ్వరుడు.

స్త్రీ సమారాధనం :

నిత్యజీవితంలోనే కాక, సాహిత్య జీవితంలోను స్త్రీని సముదాత్తంగా సముపాసించిన రమ్య సారస్వతేయుడు రాయప్రోలు. ఇది ఆయన సంవాద రూపకరచన 'రూప నవనీతం'లో పరాకాష్ఠనందుకొన్నది.

"ధృతిః క్షమా దయా శౌచం
కారుణ్యం వాగనిష్ఠురా
మిత్రాణాం చానభిద్రోహః
సప్తైతాః సమిధః శ్రియః"

అన్న వ్యాసభగవానుని వక్కాణను చక్కాగా భావాభివ్యంజకంగా రూప నవనీతంలో నిరూపించారు. స్త్రీకి సహజంగా సంప్రాప్తించిన పై లక్షణాలేకాక, ఇంకో మహోన్నత గుణాన్ని పై రూపకంలో కీర్తించారు. అది పురుషుని దైన్యయాచనలకు అవశ్యంగా కరిగిపోయి శీలదానం చేయటం. ఇది మహత్తర త్యాగం. దానితో ఆమె జీవితం వాడిపత్తరై పోతుంది. అహల్య అటువంటి త్యాగమేచేసిందని ఇలా ప్రస్తావిస్తాడు కవి :

"అహల్య పూర్ణ దాక్షిణ్యమూర్తి. చింతామణీ కామధేనువులకు నాథుడైన వాడు ఇంద్రుడు. యజ్ఞయాగాదులలో పురుహూతుడు. అప్సరస కులానికి అధిపతి. అట్టివానికి కామలాలాస తీరింధికాదు. అతని చేతము అహల్యముఖ లక్ష్మిబద్ధమై విహ్వాలించింది. దానితో దేవేంద్రుడు అకించనుడై, అతికృపణుడై యాచ్నాదీనుడై దాక్షిణ్య గుణకుల్య అయిన అహల్యను కామ్యభిక్ష పెట్టమని అర్థించెను. ఆ మహాపతివ్రతకు అది దుస్తరమైన దుస్సంధి తరుణం. అటు దాక్షిణ్యంతో కరిగిపోతుంది; ఇటు శీలభంగమునకు తపిస్తుంది. తుదకు తన స్త్రీ చైతన్య స్వభావమే గెలిచింది. తన జీవక్షీరములను ధారవోసి అమరేంద్రుని బ్రతికించి తాను పాషాణమైపోయింది". (పుట78) ఇది ఉదాత్త వ్యాఖ్యానం. నాన్యతోదర్శనీయం.

అహల్యవంటిదే — ఈ రూపకంలోని వసుళ. ఈమె సౌందర్యాన్ని ఇలా పాత్రముఖంగా అభివర్ణించాడు కవి :

"ఏ దేవతలకు ఏ పుష్పాంజలి అర్ఘ్యమిచ్చిందో వకుళ! ఆ పూర్వ పుణ్యము పూర్ణోదయమైనట్లు దీనికి అతిలోకమైన అనన్య రూపలావణ్య ప్రాప్తి ప్రాప్తించింది. ఆ సౌందర్య భాగ్యమును ప్రజలు సామ్రాజ్య సంపదను లాగా పంచుకొని గర్వించిన వాళ్ళలో నేనొకతెను. త్రిలోక దుర్లభితమైనది దీని చక్కదనం. అది ఎన్నడూ వన్నె తగ్గేదికాదు. అట్టి తరుణ తను శోభ శిశిర శిథిల శతపత్రంలాగా ఈమధ్య కసుగంది కమిలిపోతున్నది. అపరంజి వన్నె వంటి దీని అంగాంగ లావణ్యం శుద్ధస్నాన పరుషమయిన కేశపాశంవలె నిష్కోమలమై నిష్ఠుర కర్కశమౌతున్నది. కాటుక త్రాగని కన్నులవలె చెలువు చిన్నెలు, వన్నెవాసి, వెలవెల పాఱుతున్నవి. ఈ వికృతికీ, వైకల్యానికీ కారణం మైత్రీమూలము కావడం మరింత సంతాపకరం" (పుట. 82)

ఇంతకు ఏంజరిగింది? 'సుగంధి' అనేపాత్ర ఇలా చెప్తుంది. "తల్లీ! ఈ చెల్లికీ, సుందరుడికీ చిట్లా పొట్లా లేని చెలికారం. (కొంచెమాగును. అటు వకుళా ముఖమును, ఇటు విభవ నేత్రములను చూచి తాను కన్నులు వాల్చి) ఆఁ .... 'నాదీపం ఆరిపోతున్నది. ఆర్పివేస్తావా!' అని అతడు క్రూరంగా మోమోట పెట్టితే.... ఈ సుమిత్రాదేవి అమలినమైన స్నేహంతో పాటు అస్ఖలితమైన తన శీలమును కూడా ధారపోసింది.... (కనులకు నీరు వచ్చును)" ఆవిధంగా శీలాదానం చేసి 'వాడిపోయింది వకుళ' వకుళ (పొగడ పూవు) వాడిపోయేకొద్ది వాసిస్తుంది.

పూర్వ సాహిత్యంలో ఎక్కడైనా ఇటువంటి శీలదాన ప్రసక్తి ఉన్నదా? అని ఆలోచిస్తే ఒక్కచోట తగిలింది. అది భోజరాజీయంలో. అయితే అది ఆడినమాట తప్పకుండటమనే సందర్భంలోనిది. ఆ కథ : "అంభీరుడనే రాజు పుత్రి మదనరేఖ. ఆమె గురుకులంలో విద్యాభ్యాసం చేసేటప్పుడామె చక్కదనానికి చిక్కి గురుపుత్రుడామెను కామించాడు. అతడామె ఏకాంతమందిరం కదియవచ్చాడు. ఆమె అనేకరీతుల వారించింది. బలాత్కరించాడు. తనతండ్రితో చెప్తానంటే అతడు మూర్ఛపోతాడు. అప్పుడామె యిట్లా కలవరపడింది.

"నాకుగా సీతడిటు మరణంబునొందె
నేని నాకెంత పాపమో, ఇప్పుడితని
కోర్కె తీర్చితినేని నా కులములోన
నెంత హీనత వచ్చునో! యేమిసేతు!"

ఆవి ఒక ఉపాయం ఆలోచించింది. అతణ్ణి నెమ్మదిగా పేదతీర్చింది. తాను పరిణయమాడిన వెంటనే భర్త అనుజ్ఞ తీసుకొని, ఆ మొదటిరాత్రే వచ్చి తన కోర్కె తీరుస్తానని బాసటచేసింది. ఒట్టు పెట్టుకొన్నది. అతడంగీకరించాడు—ఎంతో కష్టంమీద.

తరువాత ఆ రాజపుత్రికి పెండ్లి అయింది. ఆ రాత్రి తాను తన గురుపుత్రునకిచ్చిన మాటచెప్పి, భర్త అనుజ్ఞను కోరింది. తన్ను బ్రహ్మహత్యా పాతకంనుండీ, అసత్య దోషంనుండి రక్షించమని అర్థించింది. అతడాశ్చర్య చకితుడైనాడు. అతివలనుగూర్చి యిలా తలపోసాడు;

"అతివలు సాహస కర్మలు లతిమాత్రము వారిబుద్ధి యత్నై
యునికిం
జతురాననునకు నైనను, సతుల గెలువరాదు సహజ
సామర్థ్యమునన్"

ఎంతో మథనపడి చిట్టచివరకు ఆమె కోర్కెను మన్నించాడు భర్త. ఆమె గురుపుత్రునికోసం అర్థరాత్రి పోతుంటే మధ్యలో ఒక రాక్షసుడామెను పట్టుకొంటాడు - భక్షించటానికి. అప్పుడామె భయపడక తన గురుపుత్రుని కోర్కె తీర్చివస్తానంటుంది. మళ్ళీ ఎన్నో ఒట్లుపెట్టుకొంటుంది. అప్పుడా రసుక్కాడు పోయిరమ్మంటాడు.

విప్రకుమారుణ్ణి ఒంటరిగా కలిసింది. ఆడినమాట తప్పకుండా భర్త అనుజ్ఞతతో వచ్చాను — అనుభవించమన్నది. అతడాశ్చర్యపడ్డాడు. ఆమె సత్య సంధతను మెచ్చుకొన్నాడు కాని వాడికి వివేకం కల్గింది. నా సహోదరివి. నీ పొత్తుకోరను. వెంటనే ఇల్లు చేరమంటాడు. రాజపుత్రి వేవేగ రక్కసు అకలి

తీర్పటానికి వచ్చింది. రాక్షసుడికి వివేకంకల్గి ఆమె సత్య సంధతకు, మగని పెంపుకు, విప్రుని వైరాగ్యానికి మెచ్చుకొని పాదాలపై వ్రాలాడు. ధర్మోపదేశం అర్థించాడు. ఏవేవో బోధించి ఆ రాజపుత్రి విజేతుని సమీపించింది. ఆ దంపతుల సత్యనిష్ఠకు శ్రీవిభుడే భువికి దిగి అచ్యుత లోకప్రాప్తి వరంగా ఇస్తాడు. విప్రుని ప్రాణరక్షణకై శీలదానాన్ని భర్త అనుమతితో అభిగమించిన రాజపుత్రి ఘనతను రాయప్రోలు గుర్తించారో లేదో తెలియదుగాని, వ్యాసులవారు నిర్దేశించిన స్త్రీకి గల సప్తలక్షణాల్ని ఇలా వ్యాఖ్యానిస్తారు :

"ధృతితోడ గృహంబు దిద్దవే
క్షమతో పసిపాప నెత్తవే
దయజూడవె బంధుజాలమున్
కరుణే పవె కష్టజీవులన్
శుచివై కులకీర్తి నిల్పవే
పలుకాడకు నిష్ఠురంబుగా
సఖునేపకు ద్రోహచింతనన్".

భవిష్యత్తులో భారతీయ వనిత పాశ్చాత్య ప్రభావానికి లోనై తన స్వభావాన్ని విస్మరిస్తుందనే దృష్టితో ఆమె కర్తవ్యాన్ని ఎంతో అప్రమత్తతో ప్రబోధించిన కవి రాయప్రోలు.

అంతేకాదు. విశ్వవిద్యాలయాల్లో ఉద్యోగస్థానాల్లో నరనారీలోకం కలిసి మెలసి సంచరించేటప్పు డేవిధమయిన అమలిన స్నేహం వారిమధ్య ప్రవర్తిల్లాలో భవిష్యద్దర్శనం చేసినకవి రాయప్రోలు. వీరి 'యావనవనీతం' పద్యాన్ని అతిగమించిన గద్యరచన. మహాదర్శాలకు మహితాదర్శం. నిజానికి ఈ రచన అన్ని భాషల్లోకి అనువాదం పొందదగింది. ఎంతటి బహూకృతికైనా సమర్హమైంది. ఆయితే ఆయన వక్తకాదు. తన్నుగూర్చి తాను ప్రచారం చేసుకోటం చేతగానివాడు. కమ్మగా పాడలేడు పద్యాన్ని. సభను రంజింపజేయలేడు. కాని ప్రశాంతంగా కావ్యానుశీలనంచేసే సహృదయ సాహిత్య పాంథులకు కావలసినంత పాథేయాన్ని సమకూర్చాడు.

చిత్తప్రసాదన సాధనం — దీన్ని గూర్చి రాయప్రోలవారెప్పుడు ప్రస్తావించే వారు. ఎందుకో తన లక్షణ గ్రంథాల్లో దీన్ని సంస్మరించలేదు. రూప నవనీతంలో నారదునిచేత దీన్ని ప్రతిపాదింపజేసారు.

దేశం అస్తవ్యస్తంగా ఉన్నప్పుడు ఏంచేస్తే బాగుపడుతుందో నారదుడిట్లా ఉద్ఘాటిస్తాడు : "యజన యాజనముల అదనుకాదు. క్షాత్రకాలం విప్లవ క్షోభతో అంతరించింది. నైతిక చక్రము సవ్యాపసవ్యములు తెలియకుండా త్రిప్పినందువల్ల ఒడుదుడుకులలో, మిట్టపల్లాల్లో కుంటింది. గమ్యం కాన రాకుండా చాటయింది. కాబట్టి ఇప్పుడు చిత్తప్రసాదన సాధన మొక్కటే శరణ్యం.........

ఈ సాధనకు మంత్రతంత్రాదులు లేవు. దేశ కాలపాత్రా నియమములునూ అవసరంకాదు. ఎవరికివారు అంతరంగములలో అనుష్ఠింప దగినది. దీనికి భావమే కీలకం. భావనయే శక్తి. మైత్రీకరుణాభావన అన్యులపట్లనూ ఉల్లాస ఉపేక్షాభావన స్వార్థమందును అభ్యాసం చేయవలెను. ఎక్కడెక్కడ సుఖస్ఫురణ తగులునో అక్కడక్కడ మైత్రీభావన పెంచవలెను. ఎందెందు దుఃఖము గోచరించునో అందెల్ల కరుణాభావన నెఱపవలెను. పరసుఖమును తన సుఖంగా భావించుటలో అసూయకు అవకాశం దొరకదు. తన సుఖమూ పెరుగును. ఇతరుల కష్టములను జాలితో పంచుకొనుటలో అహంకారము క్షీణమగును. కరుణ కావరమును కడుగుతుందని లోకజ్ఞులందరు! తన సుఖము వెన్నెలవలె విహరిస్తుంటే ఇతరుల దుఃఖము చీకటివలె తొంగిచూస్తున్నదని జ్ఞాపకముండును. సృష్టిలోగల ప్రాణికోటిలోని చైతన్యమంతా సమానమేకదా!........ నాట్య, గాంధర్వ, సాహిత్యములు దీనికి సాధనాంగములు. తీయని కళాకవాటములు తీయండి. నిత్య సుందరమైన లలితావరణంలో మంగళజ్యోతిని లక్షించండి. ప్రాప్యమంతయు సిద్ధించును" అంటూ ఈ సాధన విధానాన్ని ప్రవచించారు.

దీనికి మూలం పతంజలియోగ శాస్త్రంలోది. అందులోనిదీ సూత్రం : "మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం భావనా తశ్చిత్త ప్రసాదనమ్" (1–33) ప్రపంచంలో సుఖపడే వారితో మైత్రీభావాన్ని పెంపొందించుకోవాలి. వాళ్ళను ద్వేషింపకూడదు. దుఃఖపడే వారిపట్ల దయతో

ప్రవర్తించాలి. సానుతాపాన్ని పొందాలి' దీన్ని 'సానుతాపయోగ' మంటారు. ఈ సానుతాపంవల్లనే శోకం శ్లోకత్వాన్ని పొందింది. పుణ్యవిషయాలపట్ల సంతోషాన్ని పొందాలి. 'పోయి సేవింపలేకున్న పుణ్యతీర్థమహిమ వినుటయు సకలకల్మషహారమ్ము' అంటాడు ప్రవరుడు. పాప విషయాలపట్ల ఉపేక్ష వహించాలి. పట్టించుకోకూడదు ఏమాత్రం ఆసక్తి చూపగూడదు. ఈ విధంగా వృత్తుల్ని భావనచేస్తే చిత్తప్రసన్నత కలుగుతుంది. అంటే చిత్తం ప్రఫుల్లమౌతుంది. చిత్త చాంచల్యం నశిస్తుంది. మనశ్శాంతి లభిస్తుంది.

మనస్సు సరీతిగా నియమింప జాలకపోవటం వల్లనే జీవితంలో అనేక బాధలనుభవిస్తున్నాం. ఎవరైనా ఎగ్గుచేస్తే వెంటనే ప్రతీకారానికి ఉద్యమిస్తాం. ఇది మనోనిగ్రహం కోల్పోవడమే. ఇది దుర్వృత్తి. దీన్ని అవలంబిస్తే మనోబలం క్షీణిస్తుంది. మనోనిగ్రహంవల్ల అపారశక్తి లభిస్తుంది. ద్వేషం కాని క్రోధంగాని నిగ్రహించినప్పుడల్లా మహోపయుక్తమైన సత్వశక్తి చేకూరుతుంది. ఇటువంటి సత్వశక్తినుండే ఉన్నత మానసిక శక్తులు వెలువడుతాయి. మైత్రీ కరుణాముదితాది సద్వృత్తుల్ని అవలంబించటం వల్ల మానసికశక్తు లభివృద్ధి చెందుతాయి.

ఈ యోగ సూత్రాన్ని సాహిత్య సంగీతాది పరంగా అన్వయించటం రాయప్రోలువారి ఉపజ్ఞ. వాస్తవిక జగత్తులోకన్న సాహిత్య కళా జగత్తుల్లో ఈ సాధన చాలా హాయిగా సాగుతుంది. లలితకళల ఉపాసనవల్ల కలిగే గొప్ప ప్రయోజనమిదిగా గుర్తించారు. కళోపాసనలో ఈవిధంగా సాధించిన చిత్తశాంతిని నిత్యజీవితంలోకి మార్చుకొంటే మానవజీవితం మహిమోపేతమౌతుంది.

"సకల ధనమునకు విద్యా
ప్రకటితకీర్తికిం తేజమునకు బలమునకు మనం
బెరయుగ సమవ్యాప్తదున
న్నరుడు తెవులు లేని జీవనంబడు నధిపా!" (ఉద్యో.2-28)

అని విదురుడు ధృతరాష్ట్రుణ్ణి హెచ్చరిస్తాడు. మిక్కిలిగా అసహ్యపడటం వల్ల వినాశం; సహించటంవల్ల అభ్యుదయం చేకూరుతుంది. ఇది ఆర్ష సంస్కృతి. రాయప్రోలు నిజ జీవితంలోను అటువంటి సహనంగల సాధు పురుషుడు. కవితారచనే ఏకపత్నీవ్రతంగా స్వీకరించిన గృహస్థు.

ఏవం విధంగా అమలిన శృంగారం, స్త్రీ సమాదరణం, చిత్తప్రసాదన సాధనాద్యనేక విషయాల్ని భావరామణీయకంగా ఉపజ్ఞతతో కవితా ప్రస్తానం గావించిన అభినవ ఆర్షకవితాచార్యుని కంజలిఘటించే మహాభాగ్యం కలిగించిన విజయవాడ సహృదయ సమాఖ్యకు నా హృదయపూర్వక ధన్యవాదాలు. స్త్రీకి ఇంతటి సముదాత్త స్థానమిచ్చి కవితా ప్రబోధం గావించిన కవీశ్వరుడు ప్రపంచ సాహిత్యంలోనే ఇంకోడు కనిపిస్తాడా? అన్వేషించండి!

అభినవాంధ్ర కవితాశ్రీ
శుభోదయా సుబ్బారాయ!
ఓ రమ్యాక్షర సుకవీ!
నీరాజన మందుకొనుమ.





"తల్లీ కాటూరి వేంకటేశ్వరు
కవిత్వప్రౌఢి నగ్గింపగా
ఉల్లంబందున నిల్చి జృంభణముగా
నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదువాక్కునను
సంప్రీతిన్ రసోల్లాసినీ!
ఫుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ!!
పూర్ణేందు రమ్యాకృతీ!!"

# కాటూరి వారి కవితాత్మ

కాటూరి వారిమీద ఉపన్యాసమంటే, వెంటనే అందరూ 'సౌందరనందం' మీద అని భావించటం సహజం. కాని అది కేవలం కాటూరివారి కవితాత్మ కాదుకదా! అది పింగళి కాటూరివారల అద్వైత కవితాత్మ.

సామాన్యంగా కవితా దాంపత్య యోగాన్ని స్వీకరించినా కొంతకాలం తరువాత స్వతంత్రంగా ఎవరికివారుగా కావ్యాలు రచిస్తారు. అప్పుడు రెండో కవి పేరుగూడా లాంఛనప్రాయంగా చేర్చుకొంటారు. కాని కాటూరివారు ఆ సంప్రదాయాన్ని పాటించకుండ "పౌలస్త్యహృదయం, గుడిగంటలు" అనే కావ్యాల్ని తనపేరటనే వెలయించారు. దానికి అనివార్యమైన హేతువొక్కటి ఉంది. ఆయన తన సోదరునికి ఎంతో ఋణపడ్డాడు. తాను ఇల్లు వాకిలి పట్టించుకోకుండా దేశ స్వాతంత్ర్యోద్యమంలోను, కవితోద్యమంలోను తిరుగుతుండేవాడు. సంసారభారం అన్నగారే వహించేవారు. మరి ఆయన ఋణం తీర్చుకోటం ఎట్లా? అందుకాయనకు తానే దహన సంస్కారములు చేసాడు. అంతమాత్రపు పని ఎవరైనా చేస్తారు. అది తృప్తినీయలేదు. తానేదైనా స్వతంత్రంగా కావ్యం రచించి ఆయన కంకితమివ్వాలి. అందుకే గత్యంతరంలేక తనపేరే పెట్టుకొన్నారు. ఈ యథార్థాన్ని కాటూరి ఎంత రమ్యంగా చెప్పాడో చూడండి :

"నేరడు మంచిచెడ్డలు, X
ణింపడు గీమునఁ గష్టసౌఖ్యముల్
పేరిడినై సదా తిరుగు
పీడని రోయక నన్ను, మిత్రృజన్
గూరిమి నోమె; అగ్రజునకుం
దుదకిచ్చితి నిష్ఠురాగ్ని సం
స్కారము; నింక నా యొసగఁ
జాలిన దొక్కకృతి ప్రదానమే".

వినయ ధురంధరుడు : కొంతమంది ఆరాటపడి తమ ప్రతిభకు బాగా రాపిడి పెట్టి కావ్యాలల్లుతారు. తామింతవారమంతవారమని అహంకరిస్తారు. కాని కాటూరి వారికా ఆరాటం లేశమాత్రంగాకూడా ఏకోశానా ఉన్నట్లు కనిపించదు. హాయిగా లంకపొగాకుచుట్ట పీల్చుకొంటు; స్నేహితులతో కబుర్లుచెప్పుకొంటు చతుర్ముఖ పారాయణం కావిస్తు కాలక్షేపం చేయటం ఆయన నైజం. ఆయనకెంతో తృప్తి—పింగళి లక్ష్మీకాన్త సుకవితో సంగాతం, చెళ్ళపిళ్ళ వారి అంతేవాసిత్వం లభించిందని. అంతేకాదు. ఆంధ్రగీర్వాణ కవిరాజుల, ఆంగ్ల సుకవుల, రవీంద్ర కవీంద్రాదుల కావ్య కుసుమ మాలల్ని తలదాల్చే భాగ్యం లభించిందని. అందువల్ల తనకెంతో సరసత్వం లభించిందని. ఇంకా చెప్పవలసి ఉంది. ముఖ్యంగా ముట్నూరి కృష్ణారావుగారి దర్బారులో 'దర్బార్‌షాయర్' పదవిని గూర్చి 'పన్నీటిజల్లు'లనే శీర్షికను కాటూరివారు కృష్ణాపత్రికలో కావించిన రచనలు సంస్మరణీయాలు. ఈసందర్భంలో పువ్వాడవారు ముట్నూరివారినిగూర్చి చెప్పిన పద్యం తలపాగ లేని ముట్నూరివారుగా కాటూరికవికిఅన్వయిస్తుంది.

"నీ తలపాగ కుచ్చు రవణించిన
　　　　　　　　　　　　　　　రీవియె రీవి; యే మహీ
　　నేతకు చేతగాదుగద నీ
　　　　　　　　　　　　　　　నడకంగల రాజసమ్ము; కృ
　　ష్ణాతరళాంబు సంభవ నినాదము
　　　　　　　　　　　　　　　పొందదుగాదె తద్వచ
　　స్స్ఫీత తరంగ నాద వివశీకృత
　　　　　　　　　　　　　　　సర్వ జనానుమోదమున్"

కాటూరివారి వినయ సౌజన్యాలు చూస్తుంటే పూర్వాంధ్ర కవుల్లో ఎఱ్ఱాప్రెగడ జాపకం వస్తాడు. ఈయనది ఆయనది ఒకేగోత్రం. అంతేకాదు :

"మా వంశ దీపకు౦ డన
　　గావించున్ శంభుదాసకవి, నెఱ్ఱన్నన్
　　శ్రీవత్స గోత్రజాతుని
　　పావన చరితుని ప్రబంధ పరమేశ్వరునిన్"

ని సంతోషంగా చెప్పుకొన్నాడు. "కొండొక పద్యరచన చేతు చపలతన్" అప్రయత్నమ్ముగా నాకు నబ్బినట్టి కవనలేశము" ఇత్యాదిపంక్తుల్ని స్మరిస్తుంటే జంగా ఈయన అపర శంభుదాసుడే అనిపిస్తుంది. శంభుదాసుడేమన్నాడు?

"మించిన వేడ్క-వీనులకు
మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయ, క్రౌంచమును
నావల కూయఁగడంగు భంగి, శ్రే
ఘాంచిత శబ్ద సారులు
మహాకవు లాద్యులు, కావ్యశయ్య గీ
ఎంచిన కీర్తి సంగ సుఖ
పీలను నేను ప్రస్తుతించెదన్."

ఎక్కడ ఏకవికి సన్మానం జరుగుతున్నా, ఎట్టి అరమరిక లేకుండా వచ్చి ఆ కవిని గూర్చి నాల్గు మంచిమాటలు చెప్పి, అందరినీ ఆనందింపజేసే సౌజన్యం, కాటూరి వారి సహజాలంకారం. అటువంటి మహావ్యక్తిని, కవిని దేశం విస్మరిస్తే విస్మరించింది. విజయవాడ సహృదయ సమాఖ్య విస్మరించటం విస్మయజనకం. ఆలోటు తీర్చటానికే ఆధునికాంధ్ర కవిత్రయంలో ఆయనకు శంభదాసస్థానమిచ్చి మీ అందరి పక్షాన ఈ విమర్శన నీరాజన మెత్తుతున్నాను.

మూర్తిమత్వం : కాటూరివారి మూర్తి కమనీయ గంభీరమైంది. రాజసం తగ్గి తలపాగలేని, మీసాలుగల ముట్నూరివారు వీరు. కిర్రుచెప్పుల సవ్వడి ఆయన రాకకు గుర్తు. మోకాళ్ళవరకు జారిన ఖద్దరు లాల్చి, పైన ఖద్దరుసిల్కు మడత కండువా, దంతపొన్ను చేతికర్ర, నల్లఫ్రేము బంకద్దాల కళ్ళజోడు, ఎడంచేతి వ్రేళ్ళమధ్య చల్లారని లంకపొగాకు చుట్ట, ప్రసన్న మందహాస సుందరమైన వదనారవిందం, ఆలోచనా నివృత్తమైన అరమోడ్పుకనుదోయి, చెమటకు తడిసిన కాశ్మీరరేఖ, అరనెరసిన గుబురుమీసం, తాంబూలారుణాధరం, ఆజాను బాహువులు, పలుచని సమున్నత దీర్ఘకాయం, జలద గంభీర కంఠస్వనం ఎంతసేపు చూచినా ఇంకా చూడాలనే అనిపిస్తుంది ఆయన వాణి, బాణి ఎంత విన్నా వినాలనే అనిపిస్తుంది. ఇది బాహ్యమూర్తి.

అంతరమూర్తిని ప్రతిబింబించే బాహ్యమూర్తి అతి నిర్మలమైంది. ఆన
మయం. 'అద్వేష్టా సర్వభూతానామ్ మైత్రః కరుణ ఏవచ, నిర్మమో నిరహంకా
సమ దుఃఖ సుఖః క్షమీ' అన్న గీతావాక్యాలకు (12-13) లక్ష్యభూతమైం
అజాత శాత్రవమైంది. నిరంతరం ప్రసాదనాన్ని సాధించే చిత్తప్రవృత్తి, చి
చిన్న వ్యసనాలున్నా ఋషితుల్యమైంది ఆయన అంతరమూర్తి. జగద్ధితవాం
ప్రఫుల్లమైంది.

కవితామూర్తిమత్వం : ఆధునికాంధ్ర కవితా కాసారంలో రాజహంసవ
కవి శ్రీ కాటూరి. గుణాత్మకమైంది ఆయన కవిత్వం. వ్యుత్పత్త్యమలమై
ఆయన ప్రతిభ. తానెంతో కవిత అంత. కవితాశైలీ అంతే. సూటిగా సూక్ష్మం
సుందరంగా హృదయాల్ని అలరించే శైలివారిది. ఆలోచనాత్మకంగా సాగుతుం

భావనలో భిన్నత్వం : భావనలో రెండువిధాలు గోచరిస్తుంటాయి. 1) సం
దాయభావన : వాల్మీకి వ్యాసాది ఆర్షకవులు నిరూపించిన పద్ధతిలో భా
కావించటం. అంటే రామాదులు చాలా ఉదాత్తులు. ధర్మపరాయణులు. అవి
విదూరులు. ii) సంప్రదాయ భిన్నభావన: రామాదిపాత్రల్లోను దోషాలు లేకపోలే
రావణాదుల్లోను గుణాలు లేకపోలేదు. ఏ పాత్రైనా పూర్తిగా మంచిది, పూర్తి
చెడ్డది అని నిర్ణయించకూడదు. మిశ్రమ గుణోపేతంగానే ఉంటాయి. మం
ఆస్వాదించాలి.

భాస మహాకవి దుర్యోధనునిలో గల ఉదాత్త లక్షణాల్ని నిరూపించాడ
కొందరు ఆధునిక కవులు జాషువవంటి వారు ఈలాంటి భావన కావించి లో
మెప్పు పొందారు.

రామాయణంలో కైకేయి స్త్రీజనోచిత ఈర్ష్యాస్వభావ. అతి కఠోరం
రాముణ్ణి అడవులకు పంపించింది. వాల్మీకి ఆరీతిగా ఆమె స్వభావాన్ని చిత్రించాడ
లోకంలో అదేభావం పాతుకుపోయింది. కాని భాసుడు, విశ్వనాధవారు, కరుటూ
వారు కైకేయీ సౌశీల్యాన్ని, లోకకళ్యాణ దృష్టిని ప్రశంసించారు తమరచనల్లో

అదేరీతిగా లోకకంటకుడు, పరదారాపహరుడు అయిన రావణుణ్ణి గొప
రామభక్తుడుగా, సీతాపహరణంలో రావణుని అంతర్యాన్ని ఉన్మీలిస్తు 'పౌలస్త్య

హృదయ' మనే ఖండకావ్యాన్ని అపూర్వంగా రచించి పృథతగ్యూమైన తమ కవితాత్మ నావిష్కరించారు శ్రీ కాటూరి కవిశేఖరులు. అంతా నలభై పద్యాల లోపే. అయితే మంచి నాటకీయత రమ్యభావన ప్రతిపద్యంలోను ప్రబ్బకొన్నవి. చదివేకొద్ది చవులూరించి రావణునిపై మనకేర్పడ్డ పూర్వాభిప్రాయాల్ని మార్చేస్తాయి.

నామౌచిత్యం : ప్రసిద్ధమైన రావణ శబ్దాన్ని పరిహరించి 'పౌలస్త్య హృదయం' అని కావ్యానికి పేరుపెట్టటం ఔచితీ భరితం. తనకురావణుడనేపేరు ఎలా లోకంలో వ్యాపించిందో ఇలా చెప్పుకొంటాడతడే :

"మత్పదాంగుష్ఠ పరిపీడ్యమాన రజత
పర్వతము క్రిందఁజేతులు పడినయపుడు
జగము లద్రువ విరావంబు సలిపి తందు
వలన రావణుడను పేర వెలయుమనిన" (ఉ రా 3–94)

వెండికొండ క్రింద చేతులు పడ్డప్పుడు పెద్దగా అరిచాడు. అందువల్ల రావణుడైనాడు.

పౌలస్త్యుడనే పేరెలావచ్చింది? బ్రహ్మ మానసపుత్రుడు పులస్త్యుడు ఇతని కొడుకు విశ్రవసుడు. అతని కొడుకు రావణుడు. అంటే పులస్త్యబ్రహ్మ మనుమడు. అపత్యాద్యర్థాల్లో, వాని పుత్రుడు, వాని మనుమడు, వాని సగోత్రుడు అనే అర్థాల్లో ఆదివృద్ధ్యంతలోపాదులు సంభవిస్తే 'పౌలస్త్యుడ'నే తద్ధితాంతరూప మేర్పడుతుంది. ఇది రావణుడంతగా వ్యాప్తి చెందకపోయినా వాల్మీకంలోను ప్రయోగింపబడింది.

"కావ్యం రామాయణం కృత్స్నం
సీతా యాశ్చరితం మహత్
పౌలస్త్యవధ మిత్యేవ
చకార చరిత వ్రతః"

రామాయణమంటే కేవలం రామునిచరిత్రే కాదు. దాన్ని "సీతాచరిత్ర" అనీ అనవచ్చు. లేదా "పౌలస్త్యవధ" అనికూడా అనవచ్చు.

ఈ లఘుకావ్యం మొదట్లోను, మధ్యలోను రావణశబ్దమే ప్రయోగింపబడింది. చిట్టచివరి పద్యంలో "పౌలస్త్యుండు సిరికొల్వు చవికియౌ వక్షమ్ము చంద్రహాస దారితమొనర్చి, ఆగంతుదారివెంట, హృదయమున్ జొచ్చి యేకాంతమిచ్చగించి స్వాగతముపల్కు" అని ప్రయోగించి కావ్యానికి పెట్టిన పేరును సార్థకంచేస్తాడు సీతాపహరణంలోని అంతరార్థం, అంటే పౌలస్త్య హృదయమెటువంటిదో కావ్యాంతంలోగాని మనకు స్ఫురించదు. శ్రీరామచంద్రుణ్ణి తన హృదయ సింహాసనాధిష్ఠితుణ్ణి చేసి ఏకాంతంగా కొలవటమే పౌలస్త్యహృదయాంతర్గత మహోన్నత లక్ష్యం. ఇటువంటి ఉదాత్తాశయోపేతమైంది పౌలస్త్య హృదయం. దీన్నిబట్టి రావణుణ్ణి మించినరామభక్తుడు లేడనిఅనాలి. అదివైరభక్తి. అత్యంత తీవ్రమైంది. వాల్మీకి ఈ వైరభక్తిని ఎక్కడా స్ఫురింపచేయలేదు. ఇది అందరికి సాధ్యంకాదు. అందుకు రావణాబ్రహ్మకున్నంత బలం కావాలి. నాస్తికుడు కావాలంటేకూడా ఎంతో ధైర్యం కావాలి. ఆస్తికత్వంలో ఇంత ప్రతిఘటన ఉండదు.

వైరభక్తి : శాంతభావంతో కూడింది శాంతభక్తి. సంయమీంద్రులైన మునులలో దాన్ని దర్శించవచ్చు. భగవంతుణ్ణి స్నేహితుడుగా భావించి ఆరాధించటం సఖ్యభక్తి. దీనికి కుచేలుడు ఉదాహృతి. భగవంతుణ్ణి ప్రభువుగా సేవించటం దాస్యభక్తి–హనుమంతుడు. భగవంతుణ్ణి బిడ్డగా భావించి సేవించటం వాత్సల్యభక్తి–యశోద. భగవంతుణ్ణి నాధుడుగా భావించి ప్రేమించటం మధురభక్తి–గోపికలు. ఈ విధంగా పంచవిధభక్తులు లోకప్రసిద్ధం. భగవంతుణ్ణి శత్రువుగా భావించి ద్వేషించి తపించటం వైరభక్తి. పంచవిధభక్తులు ప్రవాహానికి వాలుగా ఈదటం. ఆరోది ప్రవాహానికి ఎదురీత. అత్యంత తీవ్రమైంది. మైత్రీబద్ధమైనవి అయిదు. శత్రుభావబద్ధమైంది ఆరోది. గీతలో పేర్కొనబడిన 'అనన్యభక్తి, వ్యతిరేకమార్గంలో వైరభక్తిలో బాగా సాధ్యం.

పుట్టుక : సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులనేవారు బ్రహ్మమానస పుత్రులు యోగనిద్ర నుండి మేల్కాంచిన హరిని సందర్శించాలని

వారుత్కంఠించారు. జయవిజయులనే ద్వారపాలకులు వారినడ్డగించారు. అందుకు వారు కోపోద్రగ్రులై "దుష్టమోహావిలబుద్ధితో అసురులై జనియింపుడు, లక్ష్మీవిభు మదిమచ్చరము కిన్కయుఁగాఁటియబెట్టుగాత!" అని శపించారు.

ఈ విషయం నారాయణుడికి తెలిసింది. ససంభ్రమంగా అక్కడికి వచ్చాడు. సనకాదులు సకలలోక ద్వారాల్లోను అనివారిత సంచారులు. జయ విజయులు చేసిన తప్పు తనదిగా ఉద్ఘాటించాడు. వారు ప్రతి శాపం పెట్టగల సమర్థులే. వారు తమ విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించారు. వారి ఓరిమికి హరి వారిని ప్రశంసించాడు. శాపం అనుభవించండన్నాడు. "అతిమాత్ర శత్రుత్వానికి జంకవద్దు. అది ఉదాత్తసిద్ధి ప్రదం". అంటు ఇలా అభయమిచ్చాడు శ్రీహరి:

"పగవాడైనను మూర్ఖచిత్తుడయినన్
పాపాత్ముడైనన్ మదీ
య గుణధ్యాన విధేయధీపరిణతుండై
యున్న నేనాతనిన్
సుగుణుంగా నతిధన్యుగా సుజనుగా
శుద్ధాత్ముగా నిత్యుగా
జగదేక ప్రభుగా ప్రభూత
విభవ స్ఫారాత్ముగాఁ జేయుదున్"

(హరివంశం. 1–102)

ఇక్కడ హరివంశంలో కనిపించని అంశం లోకప్రసిద్ధం. ద్వారపాలకులు శాపవిమోచన మనుగ్రహించమంటే, వైరభావంతో మూడుజన్మల్లోను సామాన్య భక్తిభావంతో ఆరుజన్మల్లోను మీరువిష్ణువును చేరగలరని అన్నారట. త్వరగా వైకుంఠానికి వచ్చి తమ పదవులు చేబట్టాలని వైరమార్గాన్నే స్వీకరించారట. దీన్నిబట్టి వైరభక్తి శక్తి విదితమౌతుంది. భాగవతంలో "వారు నాశాపవశంబునఁ బదభ్రష్టులై కూలుచు మొఱలిడిన నమ్మహాత్ములు దయాళువులై క్రమ్మఱ కరుణించి మూడు జన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెడు మని నిర్దేశించిచనిరి" (7–24) అనివుంది.

ఏమైతేనేం, జయవిజయులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా దితి జనించారు. రెండోజన్మలో కైకసి అనే రక్కసికి రావణ కుంభకర్ణులుగా వించారు. మూడోపుట్టుక కుంతీదేవి చెల్లెలికి శిశుపాల దంతవక్త్రులుగా వించారు. మొత్తంమీద వీరి నడవడిని గూర్చి భాగవతమిలా అభివర్ణిస్తుంది

"వక్రత్వం బెటులేక
పాయని మహా వైరంబుతో నిత్య జా
త క్రోధస్మరణంబులున్
విదళితోద్యత్పాప సంఘాతులై
చక్రచ్ఛిన్న శిరస్కులై
మునివచశ్శాపావధిప్రాప్తులై
చక్రింజెందిరి వారు
పార్శ్వచరులై సారూప్యభావంబులన్" (7.

మనకిక్కడ కావలసింది రావణుని విషయం. వాల్మీకి రామాయ రాముడు మానవుడుగానే పోషింపబడ్డాడు. అందుచేత వైరభక్తి ప్రసంగానికి తావులేదు. కాని అధ్యాత్మ రామాయణంలో రాముడు సాక్షాత్తుగా విష్ణు అవతారంగా, సీతాదేవి లక్ష్మీదేవిగా అభివర్ణితం. అటువంటి విష్ణుమూర్తి తాను మరణించటం తనకు మోక్షదాయకమే అవుతుందని రావణుడు నట్లున్నది. ఈ రామాయణ మాధారంగా తెలుగు రామాయణాలు రా అవతారమూర్తిగానే సంభావించాయి. ఈ విషయాలు కొంచెం విహంగవీ చేద్దాం.

**అధ్యాత్మ రామాయణాదులు** — అంగదుడు మందోదరి కొప్పుపట్టు ఈడ్చుకువచ్చిన సమయంలో రావణుడు హోమంనుండి లేచి ఖడ్గం మందోదరిని విడుపుమంటాడు. అప్పుడు మందోదరి రావణుని దుష్కృత ఏకరువు పెడుతుంది. రావణుడు మండోదరితో తాను 'రామునితో యుద్ధ రామబాణాలచేత ఖండితుడై ప్రసిద్ధమైన వైకుంఠాన్ని పొందుతానని తా

విష్ణువని తనకు తెలుసునని, సీత లక్ష్మీదేవిగా ఎరుగుదునని, తెలిసే రామునిచేత వధింపబడి పరమపదమైన వైకుంఠాన్ని పొందాలని ఉద్దేశించే సీతనపహరించానని రావణుడు వివరిస్తాడు[1]. ఆనంద రామాయణంలో కూడా ఈ రీతిగానే ఉంది[2].

తెలుగులో ప్రఖ్యాతి గాంచిన రంగనాథ రామాయణంలోనూ రావణుడు తన తల్లితోను, ఇంకో సందర్భంలో అంగదునితోను, 'రాముడు విష్ణుమూర్తి' అని అతనితోఁ బోరాడి యతనిచే జచ్చి ప్రతిలేని వైకుంఠ పదవి గైకొందునని ఉద్ఘాటించాడు.

ఇదేరీతిగా భాస్కర రామాయణంలో రావణుని నిశ్చయమిది.

"ఎఱుగుదుఁ బద్మబాంధవ
కులేశుఁడు పంకజనాభుఁడౌట యే
నెఱుగుదు మున్న యిందిర
మహీసుతయై తనరాంకు సీతగా
నెఱుగుదు నాకు రాఘవ
మహీశుని చేతి వధ క్రమంబు ని
క్కెఱిగియు ముక్తిఁ బొందఁగ
నభీష్టము గల్గుట నింత చేసితిన్"

1"జానామి రాఘవం విష్ణుమ్
లక్ష్మీం జానామి జానకీమ్
జ్ఞాత్వైవ జానకీ సీతా
మయా సీతా వనాద్బలాత్
రామేణ నిధనం ప్రాప్య
యాస్యామీతి పరం పదమ్"
—యుద్ధకాండ

2రామో విష్ణుశ్చమా సీతా
జానామి ప్రాణ వల్లభౌ
రామ హస్తావధమ్ లబ్ధుమ్
కృతా సీతా హృతా మయా
రామహస్తాత్ త్యక్తదేహో
గచ్ఛామి పరమం పదమ్.
ఆనంద రామాయణ సారకాండ—
ఏకాదశసర్గ

కంబ రామాయణంలోను ఇలాగే వున్నది. ఇందుకు కారణం ఆవతారమూర్తిగా నిరూపింపబడటమే. వాల్మీకి ధ్వని మార్గంలో ఈ ఒకటి రెండు సందర్భాల్లో సూచించినా మొత్తంమీద మానవుడుగా వస్తేనే మానవాళికి సన్నిహితుడౌతాడని ఆశించాడు. రావణుని పూర్వజ నెక్కడా వాల్మీకి ధ్వనింపజేసినట్లు కనిపించదు.

ఇట్లా ఉన్న విషయాన్ని కాటూరివారు సుందరోజ్జ్వల లఘు తీర్చిదిద్ది తమ కమనీయ కవితాత్మను ఆవిష్కరించారు.

నాటకీయత :— శ్రవ్య కావ్యంలో దృశ్యకావ్య శోభను, దృశ్యకా శ్రవ్యకావ్య పాటవాన్ని ప్రదర్శించటం మహాకవి లక్షణం. 'ఉభ ప్రౌఢిపాటించు శిల్ప పారగత్వ' మంటే అదే.

పౌలస్త్య హృదయమంతా రావణుడు సముద్రునితో గ సంభాషణమే. ఏకపాత్రాభినయమే. ఈ యభినయాలు గద్యంలోని చా చేస్తున్నారు. కాని పద్యమయమైన ఈ యభినయం ఎవ్వరూ కనిపించదు.

రామాయణంలోని అనేక రసవత్తర సన్నివేశాల్ని ఆధునికులు కావ్యాలుగా విరచించారు. వీటిలో కీ॥శే॥ మాధవపెద్ది బుచ్చిసుందరరామశా (ఈ కవి కాటూరి వారికెంతో ఆత్మీయులు) వ్రాసిన పంచవటి, శబరి, గాంచాయి. ఇవీ సంభాషణాత్మకంగానే ఉంటాయి. ఇవి చాలవరకు మధుర భావనకు మరింత మాధుర్యాన్ని చేకూరుస్తాయి. కాని 'పౌ హృదయం'లోని సన్నివేశ కల్పనం వాల్మీకి చేయంది. కాటూరివారి ఉ నిర్మల దర్పణం.

వాల్మీకి రామాయణంలో ఉప్పొంగుతున్న ఉదధిమీద రాముడు బా అనుసంధిస్తే సముద్రుడు రాముణ్ణి పురుషకారంతో వారధి కట్టి దాటి ర కోరినట్లుంది. కాని సముద్రుడు రామాభిగమనాన్ని భీతచిత్తంతో రావణున కెరిగించటం అపూర్వ నాటకీయ సన్నివేశం.

సముద్రం లంకకు సహజ సిద్ధమైన అగడ్త. సముద్రుడు శత్రువుల ఆగమనాన్ని అహరహం నిర్నిద్రుడై నిశితంగా పరిశీలిస్తాడు. సముద్రుడికి రావణుని బాహువింశతి, రావణుడికి సముద్రుని వీచికాకోటి పెట్టనికోటలు. కట్టని అగడ్తలు.

ప్రళయ భయంకర వార్తను కొనితెచ్చే వ్యక్తి నురుగులు క్రక్కుకొంటు, రొప్పుకొంటు, పరుగులు పెట్టుకొంటు రావటం గమనిస్తాం. సహజ లక్షణాలివి సముద్రుడికి. ఇవి విపత్కర పరిస్థితుల్లో ఎలా ఉపయోగపడ్డాయో కవి ఎత్తుగడలోనే నిరూపించి రసంచిప్పిల చేస్తాడు.

ఇతివృత్తాన్ని ఎంతో గుప్తంచేసుకొని పతాకస్థాయిలో రెండు పాత్రలు కలుసుకోటం, అందులో ఒకటి జడం అయినా చైతన్యమైన మానవాకృతి వహించటం, ఆ పాత్ర నోట మాటరాక చివరకు రావణునినోట అతని మనస్సులో మసలుతున్న రామ శబ్దం ఉచ్చరితంకాగా అతడు తలూపటం, దానిమీద అనేక విషయాలు ప్రసంగించి తన హృదయాన్ని పౌలస్త్యుడావిష్కరించటం చదువుతుంటే సహృదయులు సముదాత్తానంద నిర్భర హృదయులౌతారు.

ఎత్తుగడ చూడండి :

"నురుగుల్ గ్రక్కుచు నూర్పు సందడులు
మిన్నుల్ ముట్ట నొక్కుమ్మడిన్
పరుగుల్ ద్రొక్కుచు శీర్ణ కేశముల
నుద్బాహుండ_ వచ్చు త
త్తరమున్ గాంచిన నుత్తలం పడెడిఁ
జిత్తం; బీభయోద్వేగ మెం
వ్వరిచే నీ కొనఁగూడె నర్ణవపతీ !
వాక్రుచ్చవయ్యా ! వెసన్"

రావణుడు భయపడటం ఎప్పుడు సంభవం? భాస్కరుడు గతితప్పినప్పుడు. పయోదగర్జ వినిపించినపుడు. తారకలు రాలాలి కాని అలా జరగలేదే! కనీసం చేతికత్తి చంద్రహాసం జారలేదు. సముద్ర గర్భంలో ఔర్వశిఖి ఆరలేదు.

"సజ్య కార్ముకుడై రామచంద్రమూర్తి
శింజినీ టాంకృతియు నింత సేయలేదు."

అనేటప్పటికి సముద్రుడదే సంభవించిందన్నట్లుగా తల ఊపుతాడు. అప్పుడు రావణుని కానందం మిన్నుముట్టింది. ఎన్నాళ్ళబట్టో! కాదు ఎన్నేళ్ళనుండో కళ్ళతో తానెవరికోసం ఎదురు చూస్తున్నాడో అది యిప్పుడు జరిగింది. అత్యుత్కటమైన ఆ సంతోషాన్నీ రీతిగా నాటకీయంగా ప్రకటిస్తాడు కవి.

"ఎట్లు! చెప్పవు? రాఘవుడే! మరేల?
విడువు కంపము, త్రోవ రా విడువు మౌని
కనుజ సౌమిత్రితో, సూర్యతనయుతోడ
హనుమతోఁ దరుచర వరూధినుల తోడ."

మరింత నాటకీయంగా

ఎన్నాళ్ళకు? ఎన్నాళ్ళకు
కన్నుల వింశతియు నాకుఁగల్గిన ఫలమూ
పన్నమయివచ్చె! భుజగ
ర్వోన్నతి చరితార్థమగు ముహూర్తము వచ్చెన్"

పూర్వజన్మ స్మృతి పొడగట్టిందా అన్నట్లు

"నాటికి నేడా? తలపున
నాటెను సామికి వికుంఠనగరోదితమా
మాటలు; దీర్ఘ విలంబము
ఘాటించి విభుండు నన్ను వంచించెఁగదే!!"

స్వామి కరుణకు పాత్రుడు కావాలని ఆత్రంకొద్దీ కావించిన అనేకానుచిత కృత్యాల్ని స్మరించాడు. ఆయన్ను వియోగబాధతో కుంచింపజేసినందుకు చింతించాడు. గత్యంతరం లేక తానారీతిగా కావించవలసి వచ్చింది. అప్పటికిగాని ఆయన లంకకు ఎత్తిరాడుగదా!

రావణుడొక్కడే సంభాషిస్తు ఉండటంచేత దశవిధ రూపకాల్లో ఒకటైన భాణానికున్న లక్షణాలు కొన్ని ఇందులో గోచరిస్తాయి. ధూర్త చరితం, వీర శృంగారేతివృత్తం, ఇతర పాత్రలతో చేసే సంవాదం ఆకాశభాషిత రూపంలో ఉండటం వంటివి గ్రహించవచ్చు.

## వివిధౌచిత్యాలు

ఈ లఘు కావ్యం అనేక విధాలుగావున్న ఔచిత్యాల కాటపట్టు.అందువల్ల ఇది అలఘుకావ్యత్వాన్ని సంతరించుకొన్నది. అందులో కొన్నింటిని గూర్చైనా ముచ్చటించుకోక తప్పదు. నామౌచిత్యాన్ని గూర్చి ముందే చెప్పాను. సన్నివేశౌచిత్యం గూడా చెప్పినట్లే. ఇక ముఖ్యమైంది :

పాత్రౌచిత్యం :— రావణుని పాత్ర యిందులో అతివాల్మీకంగా పోషింపబడింది. తాను జగదేక వీరుణ్నని, భయమనేది యెరుగనివాణ్నని అంటాడు. అతను నిరంతరం నిరీక్షించేది దేనికి? రామచంద్రమూర్తి సజ్యకార్ముకుడై శింజినీటాంకృతి చేస్తు తన్ను సంహరించడానికి లంకకు అభిగమించాలి. రామచంద్రుడు వస్తున్నాడన్నట్లు సముద్రుడు తల ఊచినప్పుడు ఆయన ఆనందానికి అవధులు లేవు. తన ఇరువది కనులకు కళ్యాణం కల్గుతున్నదని పరమోత్సాహం డౌతాడు. తన భుజగర్వోన్నతి చరితార్థమయ్యే సుముహూర్త మాసన్నమైందంటాడు. ఇంత దీర్ఘ విలంబంచేసి విభుడు తన్ను వంచించాడని విలపిస్తాడు.

రాముణ్ణి లంకకు రప్పించుకోని ఆయనతో పోరాడి మరణించటమే రావణుని జీవిత ధ్యేయం. ఈ లక్ష్య సాధనకై అతడెన్నో దుశ్చర్యలకు కూడా పాల్పడక తప్పలేదు. వాటినన్నింటిని సంస్మరిస్తు "ఈ విశ్వ విక్షోభమెలా

తప్పించవదు సామి నన్నెరిగి? యేలా నన్ను వంచించుటల్?" అని సూటిగా ప్రశ్నిస్తాడు. భక్తుని హృదయారాటాన్ని భగవంతుడు గుర్తించకపోతే ఎట్లా?

'నా జానకి ఎక్కడుంద'ని ఖగాలను, మృగాలను నిలిపి ప్రశ్నించి విలపించాడేగాని, ఇది రావణకృత్యంగా గ్రహించలేక పోయాడు. మానవుడై షట్టిమయాప్పతుడైనాడు తాను తన దైవంపట్ల నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించినందుకు రావణుడు పడ్డ పశ్చాత్తాపాన్ని సముచితంగా నిరూపించి కాటూరివారు రావణపాత్రకు నూత్న ప్రాణాన్ని పోసారు పఠిత కితఃపూర్వం ఈ పాత్రమీద కల్గిన దురభిప్రాయమంతా పటాపంచలౌతుంది.

చివరకు జటాయువువల్ల సీతాపహరణ వార్త విని 'క్రోధముద్రితాననుడై విలులితాశ్రు కలిత కపోలముల గెంపుదొలక' 'రావణా!' అని తన పేరెత్తినప్పుడు రావణుడికి మహాశ్శాంతి కల్గిందట.

రావణుడు తాను గావించిన దుష్కృత్యాల నన్నింటిని సంస్మరిస్తాడు. అందులో మరీ దారుణమైనవి— మునుల్ని హింసించటం, సతుల్ని చెరబట్టటం. 'ఇలా చేయటం తనకేమైనా వినోదమా?' అని రావణుని ప్రశ్న. ఇందువల్లనైనా తన్ను ప్రభువు గుర్తిస్తాడని ఆశ. తన ఆశలన్నీ వమ్మైనాయి. రావణుణ్ణి అన్వేషించుకొంటు రాముడు లంకకువస్తే యితర భక్తులు తన ప్రభువు రావణ పక్షపాతి అనుకొంటారు. ఆ అపఖ్యాతి తనవల్ల ఆయనకు రావటం తనకిష్టంలేదు. అందుకే ఇంతలేసి క్రూరకృత్యాలు కావించటం. అయినా ప్రభువు తన హృదయం గుర్తించలేదు. తప్పనిసరియై "సాగరా! జానకమ్మ తల్లినే అపహరించాన"ని తన అంతరాత్మను కుమ్మరిస్తాడు. దానితో సహృదయుని హృదయం ఉప్పొంగుతుంది.

ఆడినమాట తప్పింది తన ప్రభువు. అయినా లోకం గ్రుడ్డిది. ఆయన్ను పల్లెత్తి ఒక్కమాటనదు. తన్నే నిందిస్తుంది. లోకనిందకు భయపడేవాణ్ని కాదని, ఆ మంచిపేరు తన ప్రభువుకే దక్కనీమని ఎంతో ఔదార్యాన్ని ప్రకటిస్తాడు— రామభక్తుడుగా రావణుడు.

తన ఘనతను తానే చాల చిత్రంగా చాటుకొంటాడు పౌలస్త్యుడు. రాముడు తన్నుగూర్చి తక్కువగా అంచనా వేసుకొన్నాడట. తనకు సీతామాతను అప్పగించి క్షమాభిక్షనర్థిస్తాననుకొన్నాడు పాపం. ఆ పప్పులు తన దగ్గర ఉడకవు. తాను లోక విద్రావణుడు. ఉగ్రవీర చరిత్ర ప్రథితుడు, దశగ్రీవుడు. యుద్ధంలో గెలుపో, ఓటమో కాని అన్యం తెలియనివాడు. అన్యాల్ని యాచించడం కల్ల. ఈ విధంగా సముద్రుడితో తన ఆంతర్యాన్ని ఆవిష్కరిస్తుంటే చదవరికెంత ఉల్లాసమో!!

భక్తిప్రఫుల్ల హృదయుడు :— పౌలస్త్య హృదయ కమలం రామభక్తి ప్రఫుల్లమైందిగా అతని సంభాషణాన్ని బట్టి విదితమౌతుంది. "ఓ నెచ్చలీ! నా ప్రభువును చూచావుగదా! ఎలాఉన్నాడా రఘూద్వహుడు? లలనా విరహ వ్యథతో కృశించాడా? దశాస్యకంఠ దళన ప్రవణాగ్రహ వృత్తితో వెల్గుతున్నాడా?" మొదలైన ప్రశ్నలుత్కంఠ పూరితాలు తన ప్రభువు నిర్వర్తించిన ఘనకార్యాలు సంస్మరిస్తాడు. ఆయన త్యాగగరిమకు అంజలి ఘటిస్తాడు

సముద్రుడు ధన్యుడని ప్రశంసిస్తాడు. ఎందుకంటే మత్స్య కూర్మావతారాలు నీటికి సంబంధించినవి. ఆ రూపాలతో శ్రీహరి సముద్రంలో ఈదులాడాడు. ఆ శ్రీహరే ఇప్పుడాతనికి దర్శనమిస్తున్నాడు. అతడే మళ్ళీ ఏమీ తెలేనట్లు తరంగ లాలితుడై అతనిమీద పవ్వళిస్తాడు.

కాని అందరికంటే తానే ధన్యుణ్నని అఖండాత్మ విశ్వాసంతో చాటుకొంటాడు రావణుడు. ముద్దాడిన తండ్రికి, పాలిచ్చి పెంచిన తల్లికి, కోరి వరించిన భార్యకు, సపర్యలు సల్పిన తమ్మునికి లేని అదృష్టం అతనికి పట్టింది. 'జగదభిఘాతి రక్కసుడె సామికి మిక్కిలి గూర్చువాడు.' ఎందుకని? అందరు ఆయనకాశ్రితులై రమ్యరూపాన్నే చూచారు. కాని తానో అన్యదుర్లభమైన భయ విస్మయకారియైన విలయసమయ భీకర గంభీరరూపాన్ని చూడబోతున్నాడు. జానకీమాత సహకరించకపోతే తనకీ మహావకాశం లభించేదికాదు. 'ఎవరికిని దొరకని అగాధ తలములు దొరకునాకు' అని సంతృప్తుడౌతాడు. కటి నృసింహా

కారాలతో దనుజకోటి నంతమొందించిన తన ప్రభువిపుడు పురుషోత్తమాకృతితో తనతో పోరునల్పటం తన కపూర్వ గౌరవంగా సంభాషించే ఉదాత్త భక్తుడు రావణుడు.

తానితఃపూర్వ మెందరినో యోధాన యోధుల్ని హతమార్చాడు. ఆ యుద్ధాలన్నీ ఒకయెత్తు. ఇప్పుడు శ్రీశుడు, ఆత్మేశుడు అయిన రామునితో యుద్ధమొనర్చే మేటి సమయం సమాయత్తమైంది. దీనికిదేసాటి! 'ఓ చంద్రహాసీ!' అని తన చేతికత్తిని హెచ్చరించటం, మహోన్నత వీర లక్షణం. తన పది చేతుల్ని పదిలమనటం సముజ్జ్వలం.

"లేదు పతంగ వాహనము
లేవు కరంబుల పాంచ జన్య కౌ
మోదకముల్, సుదర్శనము
పూనడు, రావణు గెల్వవచ్చె దా
మోదరుడెంత నేరుపరి యో"

అని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తాడు. తనతో తలపడటం మహాసాహసం. తన్ను 'క్రూరవిక్రము, స్వాత్మహనన పాతకుని కావింప వలద'ని ప్రాధేయ పడతాడు. ఆపు మూడైనా మూడు ఆరైనా అహవం తప్పదు! దాశరథియో! పంక్తిధరుడో!! ఎవరో ఒకరు శాశ్వతకీర్తి నార్జించాలి.

"సంద్రుడా! పో! త్వరగా పో!! నా స్వామికి రుచిరాగతం పలుకు. అప్పుడే పుట్టిన ముత్యాలతో ముగ్గులు పెట్టించు. అత్యున్నత గంభీరవీచికామ తల్లిని గద్దెగావించు. రమకంటే కౌస్తుభరత్నం కంటే రమ్యమైన రత్నాలతో అలంకరించి, లంకకుపంపు. అతని వక్షస్సుపు చీల్చి, అతని హృదంతరాళంలోకి ప్రవేశించి యేకాంతసేవ కావిస్తానని" రామునితో చెప్పమని సముద్రునితో అన్న మాటలు ముత్యాల మూటలు. అతని పరాక్రమానికి, నిష్కల్మష హృదయానికి, భక్తితత్పరతకు అక్షర మణిదర్పణాలు.

సంభాషణౌచిత్యం :— సంభాషణం గొప్ప కళ. వినేవాడి వీనులకు విందు చేయటమే ఈ కళాధర్మం. ఇంకా వినాలి, ఇంకా వినాలని అనిపించాలి.

నిజానికి లఘుకావ్యమంతా పౌలస్త్యుడు సముద్రునితో కావించిన సంభాషణమే. దీర్ఘసమాస భూయిష్ఠం కాకుండా, అలతి అలతి పదాలతో కాహళ సంధించినట్లుగా శైలి సాగిపోతుందీ కావ్యంలో. హావభావాలు చక్కగా చిక్కగా రూపు దిద్దుకోవాలి. కాకువులు, ఊనికలు, ఆశ్చర్యార్థకాలు, ప్రశ్నార్థకాలు ఎన్నెన్నో సంభాషణలో చోటుచేసుకోవాలి. అదే సజీవ సంభాషణ మనిపించుకొంటుంది. వక్త కరచరణాద్యవయవాలు కదిలిస్తు మాట్లాడతాడు. అంటే సంభాషణ కేవలం వాచకంతోనే కాకుండా ఆంగిక విన్యాసాత్మకంగాను ఉంటుంది. ఆంగికాభినయాన్ని కూడా కవి శ్రవ్యకావ్యంలో వర్ణించి నిరూపించుకోవాలి. శ్రోతకు సత్త్వభావస్ఫూర్తి కల్గించేటట్లు కావింపబడ్డ సంభాషణ అత్యంత శక్తిమంతమైంది. తిక్కన కవితలో ఈ ధర్మాలన్నీ పరిపోషితాలు. రావణుని సంభాషణలోను ఈ లక్షణాలు కావ్య పరిధికి తగినట్లు నిరూపితాలు.

సంభాషణ చప్పగా కాక ఆత్మవిశ్వాస స్ఫోరకంగా ఉండాలి. అందుకే అంటాడు రావణుడు ధీమాగా–

"రావణుడన్న కాళ్ళబడు
 రాయియు రప్పయుగాదు; వాలిమై
కావగ నాతి కోతియును
 గాకియు గ్రద్దయు గాదు; లోక వి
ద్రావణు దుగ్రవీర చరిత
 ప్రథితుం డతిమానియా దశ
గ్రీవుడు పోరిలో జూడిచి
 గెల్పును, చచ్చునుగాక, వేడునే!"

ఇది శబ్దశక్తి పురస్కృత ధ్వని మర్యాదావిలసితమైన పద్యం. రామాశ్రితులకు, తనకు గల భేదాన్ని ఎంతో హుందాగా రావణుడు ఆలోచింప చేస్తాడు. సంభాషణెప్పుడూ ఎదుటివాడిచేత బాగా ఆలోచింప చేసేదిగా ఉండాలి. అదే ధ్వనంటే. ప్రశ్నాత్మకంగా ఉండాలి. కాళ్ళబడ్డరాయి– అహల్య. శరణు వొచ్చిన కోతి– సుగ్రీవుడు, శరణువొచ్చిన కాకి, కాకాసురుడు, సీతాపహరణ

వార్త చెప్పిన గద్ద— జటాయువు. కానివేవికాదు. తన చరిత్ర, తన ఆత్మీయత తనఅంతర్యం అన్నీ పృథక్భూతమైనవిగా, పృథగాలోచనాత్మకమైన వంటంలో ఎంతో గాంభీర్యం ఉట్టిపడుతుంది. ఇది వీర రసాత్మక సంభాషణ.

సంభాషణం నవరసభరితం కావాలి. పైరీతిగా మాట్లాడిన రావణుడే "నెచ్చలీ! విభుని చూచితివేకదా! చెప్పుమెట్టులున్నాడో!" అని ఎంతో జాలిగా ప్రశ్నిస్తాడు. తాను రామునకు కల్పించిన వియోగానికి మిక్కిలి దుఃఖిస్తాడు. తిరిగి అంతలోనే తేరుకొని ఆయనకు నాకు ఆహవరంగంలో దర్శనమంటాడు. ఒకకంట కన్నీరు, ఇంకోకంట వీరం.

ఈ రావణ సంభాషణంలో ప్రభుభక్తి, ఆత్మశక్తి, విముక్తియం దనురక్తి ఉట్టిపడుతాయి. పఠితలు సముద్రుడిలాగా అయిపోయి ఆ సంభాషణా న్నాలకించి, పౌలస్త్య హృద్గత భావ రత్నాల్ని ప్రోగుచేసుకొని ఆనందంగా, ఆశ్చర్యచకితంగా నిట్టూరుస్తారు— ఎంత భక్తి భావోజ్వలమైంది యీ మహా వీరుని అంతరంగం అని.

సంబోధనౌచిత్యం :- ఇందులోని సంబోధనలన్నీ సముద్రుని పరమైనవి. వాటి ఔచిత్యాన్ని చూద్దాం.

అర్ణవపతీ! :— 'అర్ణ' శబ్దం 'ఋ—గతౌ' అనేధాతు నిష్పన్నం. ధ్వనించు, గర్జించు, మ్రోగు, అనే అర్థాల్నిస్తుంది. ధ్వనించే నదులకధిపతి సముద్రుడు. వైకుంఠంనుండి దిగివచ్చిన రమాపతి శ్రీరాముడు అట్టి రాముణ్ని చూచి భయంగా ధ్వనించవలసిన అవసరం లేదనే భావం స్ఫురిస్తుంది. అంతేకాదు, బాగా ధ్వనించి ఆయనకు ఘనస్వాగతం పల్కమనే అర్థంకూడా భావించవచ్చు. సముద్రుని వాక్కులీధ్వనులేకదా!

సాగరా :— సగరుని కుమారులు సాగరులు. వీరు తమ తండ్రి యజ్ఞాశ్వాన్ని అన్వేషించటానికి పడ్డ శ్రమ, కడకు కపిలమహర్షి శాపానికి గురికావడం వంటి పూర్వ గాథలు స్మరణకు వస్తాయి. ఇక్కడ రావణుడు తాను రామునిదృష్టి నాకర్షించటానికి పడ్డ తిప్పలు, చివరకు పరాకాష్ఠగా సీతాపహరణం కావించటం

పేర్కొంటాడు. సగర కష్ట గాథవంటిదే తన కష్టగాథకూడా అనే అభిప్రాయాన్ని ఊహింపజేస్తుంది.

మహాంభోనిధి స్వామీ :— ఇది గంభీరమైన సంబోధన. స్వామిద్రోహం చేసిన రావణుడు పశ్చాత్తాపబుద్ధితో సముద్రుడితో చేసే ప్రసంగం కదా! రావణుని కన్నీరు ఆ మున్నీటి ఏలికకు భక్తిసమర్పణంగా గోచరిస్తుంది. మన కష్టగాథల్ని ఇతరులకు నివేదించేటప్పుడు వాళ్ళకు పెద్దరికమిస్తాం. ఆ పెద్దరికం 'స్వామీ' అనటంలో ధ్వనిస్తుంది.

నెచ్చెలీ :— (నెఱ+చెలి) నిండుగుండె గల స్నేహితుడా! అనటంలో రావణుని సుస్నేహం గోచరిస్తుంది. తన అంతరంగాన్ని ఆవిష్కరిస్తున్న రావణుడు సముద్రుని నిండుదనాన్ని సంభావించటం సముచితంగదా!

తోయధీ :— నీటికధిపతి. తొలుత అంతా జలమే. అప్పుడు హరి మత్స్య కూర్మావతారాల్ని ధరించాడు. మానవావతారమెత్తి కూడా ఆ తోయధినే తరించటానికిరావటం తన అదృష్టమని రావణుని అభిప్రాయం. అవతారాంతంలో తిరిగి ఆతోయధి తరంగ లాలితుడౌతాడు. అతనిమీదనే పవ్వళిస్తాడు. తన స్నేహితుని అదృష్టం. దానికి ఆనందించే సరసాంత రంగుడుగా రావణుడీ సంబోధనవల్ల ద్యోతమానుడౌతాడు.

చంద్రహాసాసిరో! :— రావణుడు తన కత్తినిలా సంబోధిస్తాడు. ఇతఃపూర్వం తనకెన్నో విజయపరంపరల్ని సమకూర్చిందిది. ఇప్పుడు తన ఆత్మేశుణ్ని అర్చించే మేటి పండువు ఆసన్నం కావటాన్ని ఆనంద పారవశ్యంతో కావించే సంబోధనమిది. చంద్రహాసాన్ని పూర్వం శివుడు రావణునకిచ్చాడు. దశగ్రీవుడు భక్తితో చేసిన స్తోత్రానికి ఉప్పొంగి కరకంఠుడు దీర్ఘాయువుతోపాటీ చంద్రహాసాన్ని ప్రసాదించాడు. దానితోనే ఈతని జైత్రయాత్రలన్నీ సాగాయి. ఇది ఈ జన్మకు కడపటి యాత్ర. దీనితో తన వైకుంఠయాత్రకు రెండో మెట్టెక్కుతాడు. 'చంద్రహాసం'తోపాటు 'అసి' శబ్దాన్ని చేర్చి అనుప్రాసను సాధిస్తాడు కవి. ఇందులో 'రో' అనే సంబోధన ప్రత్యయం స్త్రీ వాచకాలమీదనే చేర్చాలని ప్రౌఢ వ్యాకరణ నియతి. 'ఏసుంగురో!' వంటివి తత్కర్త దృష్టిలో

అప్రమాణాలు. కాని రావణునికి చంద్రహాసం అత్యంత ప్రీతిపాత్రం. ప్రేమాస్పదమైనదాన్ని ప్రీగానే భావించాడనటాని కీక్రింద సంబోధనం నిదర్శనం.

నైకప్రణయినీ :— న+ఏక ప్రణయినీ, ఒక్క యుద్ధంతోనే ప్రేమను చేకూర్చనిదానా! అంటే అనేక యుద్ధాల్లో విజయలక్ష్మిని సమకూర్చి ముందుకు నడిపించినదానా! అని అర్థం.

**పదిజంటల చేతులార! :—** ఏ వీరుడూ ఇటువంటి సంబోధన చేయటాని కవకాశం లేదు. సహస్రశీర్షుడు, సహస్ర బాహువునైన విరాట్పురుషుడు చతుర్బాహుడే, ఆ తరువాత రెండుచేతుల నరుడై నాడు. అతడిప్పుడు తన్ను సంహరించడానికి వస్తున్నాడు. కాబట్టి మంది బలంతో ఆ బలాన్ని హరించమనే అర్థం ఈ సంబుద్ధిలో ద్యోతమానం.

ఈ విధంగా ఈ సంబోధనలన్నీ సాభిప్రాయాలు, సరసాలు, సముచితాలు, సంభాషణకు సజీవత్వాన్ని సమకూర్చుతాయి.

వృత్తాంతౌచిత్యం :— ఎవరైనా సంకట పరిస్థితుల్లో ఎదుటి వారితో సమాలోచనం చేసేటప్పుడు తాను పూర్వమిట్లా చేశాను, అట్లా చేశానని పూర్వ వృత్తాంతాలు ఏకరువు పెడతారు. అటువంటి దసాధారణ చరిత్రగల రావణు దెన్నెన్ని వృత్తాంతాలు సంస్మరింపజేస్తాడో చెప్పాలా? అవి లోకప్రసిద్ధం కాబట్టి వివరించకుండా సూచించటమే ఉచితం. ఈ గాథలన్నీ రావణ పాత్రను బాగా పరిపోషిస్తాయి.

i) పాతాళాధిప తోకద్రొక్కటం :- రావణుడు భోగవతీ నగరంపై దండయాత్రకు వాసుకిని జయించటం సూచితం.

ii) శచీ ప్రాణేశు కైశ్యమ్ము డాచేత పట్టటం : శచీ ప్రాణేశుడైన ఇంద్రుని జుట్టు ఎడంచేత్తో పట్టి ఈడ్చిన సాహస కథ ఊహ్యం. ఇక్కడ పుత్రుడైన మేఘనాథుని విజయం ఆత్మ విజయంగా సంభావించుకొంటాడు రావణుడు.

iii) వెండికొండ శివుతో శీతాచలేంద్రాద్యాజోపేతం బల్లల నాడ చేయుటం : కైలాసంలో సుఖంగా కాలక్షేపంచేసే శివుణ్ని గజగజవణకించిన గాథ ఇందులో ఉట్టంకితం. రావణుడు పుష్పక విమానంపై సంచరిస్తు కైలాసానికి వచ్చి అక్కడి ప్రకృతి సౌందర్యానికి పరశించిపోతూ సంచరిస్తాడు. ఆ విమానాన్ని నందికేశ్వరుడాపుతాడు. గౌరీశంకరులు ఏకాంత విహారం చేస్తున్నారని, అన్యులక్కడికి ప్రవేశింపరాదని హెచ్చరించాడు. అందుకు పకపక నవ్వుతాడు, రావణుడు.నందీశ్వరుడు శపిస్తాడు. కోతిలాగా వళ్ళికిలించాడు కాబట్టి కోతులవల్ల అతని వంశం నాశనమౌతుందని.

ఇంకా అహల్యా వృత్తాంతం, జటాయువు సంగతి మొదలైనవి మాట మాత్రంగా గుర్తుచేసి రావణుని వీరాన్ని, ఆత్మవిశ్వాసాన్ని, శక్తి సామర్థ్యాల్ని గుర్తుచేస్తాడు, కవి.

పదౌచిత్యం :— ఉత్తమ కవితలో ప్రతి పదం ఔచితీభరితంగా ఉంటుంది.

కావ్యశీర్షిక 'పౌలస్త్య హృదయ'మైనా పౌలస్త్య పదం చివరిదాకా ప్రయోగింపబడదు. అతని ఉదాత్త భక్తి సంభరిత హృదయం ఆవిష్కృత మైనప్పుడే 'పౌలస్త్య' శబ్దం ప్రయోగితం.

అట్లాగే 'రావణ' శబ్దం. సీతాపహరణ వార్త, జటాయువువల్ల వినగానే విలులితాశ్రు కలుషిత కపోలముల కెంపుదొలక క్రోధ ముద్రితాననుడై రామభద్ర మూర్తి దశకంఠుడా! 'పౌలస్త్యా'! అనకుండా 'రావణా' అని పేర్వాడి ప్రతిన సలిపి' అనటంలో లోకవిద్రావణత్వం స్ఫురిస్తుంది.

'మర్త్యుల రాజనీతి నిపుణత్వంబెల్ల విన్నావుగా' అనటంలో 'మర్త్య' శబ్దం సార్థకం. మరణశీలంగల మానవుడు అబద్ధాలాడుతాడెందుకో! పూర్వం వైకుంఠంలో చేసిన ప్రతిజ్ఞ విస్మరిస్తాడు— మానవావతారమెత్తగానే.

'మాయధారిర్భయ్యె మహికిడిగ్గి' అనటంలో 'మాయధారి'పదం రసోచితం. వైకుంఠంలో మాయాతీతుడు భూమిమీద పడగానే మాయావృతుడైనాడు. అప్పుడు

కేవల జ్ఞాన స్వరూపుడు ఇప్పుడెన్నెన్నో నాటకాలాడుతున్నాడు. 'తన మాయలు చెల్లనిత్తునా?' అని ప్రశ్నిస్తాడు రావణుడు.

పసుడై :— తాను వల్లభునికి వేసిన లంకె లోకానికి తెలియదు. 'పసుడై' యెఱుగునంటాడు. అంటే శత్రువని, తాను శత్రుభావం వహించిన రాముడని, పసిడంటే పరమాత్మ అని తన దైవమని అర్థం. ఈ సందర్భంలో 'వల్లభ' శబ్దం కూడా సముచితం. తాను జీవాత్మ, ఆయన పరమాత్మ, భక్తుని అల్పత్వం, పరమేశ్వరుని అఖండత్వం, వల్లభత్వం సూచితం.

'ఎవ్వరికిని దొరకని అగాధ తలములు దొరకునాకు'. వైరభక్తిలోని అగాధత్వం అందరికీ అనుభవంలో అందేదికాదు. ఇతర భక్తుల్లో పరమేశ్వరుణ్ని ఎప్పుడైనా విస్మరించటం సంభవం. కాని వైరభక్తిలో ఏక్షణంలోను విస్మృతి కలగదు సరికదా— నానాటికి లోలోతులకు పాకుకుపోతుంది. దీనికి రావణుని చర్యలే నిదర్శనం.

పురుషోత్తమాకృతి :— ఇతః పూర్వం వరాహ రూపంలోను, నారసింహ రూపంలోను నారాయణుడవతరించి హిరణ్యాక్ష హిరణ్యకశిపుల్ని అంతమందించాడు. కాని యిప్పుడు తన భాగ్యంకొద్దీ పురుషోత్తమాకృతిలో దర్శనమిస్తున్నాడు. ఇది పుంసాం మోహనరూపం.

"శ్యామల కాంతి మోహనము
సౌమ్యగభీరము సుప్రసన్న రే
ఖా మృదుహాస భాసురము
గన్నుల పండువునైన రాము నె
మ్మోము"

ఇక్కడ పురుషులలో ఉత్తముడనే కాకుండా నారాయణుడనే అర్థాంతర స్ఫూర్తి కలుగుతుంది.

దామోదరుడు :— దామము ఉదరమందు కలవాడు నారాయణుడు. కాని తెలుగులో దీనికి సోమరి, పనికిమాలినవాడని కూడా అర్థాలున్నాయి. తనవంటి

వీరాగ్రేసరునితో ఎట్టి వాహనం లేకుండా పూలమాల మెళ్ళో వేసుకొని వట్టి చేతులతో వస్తున్నాడు ప్రభువని రావణుడు తెలుగర్థంకూడా స్ఫురింపజేస్తాడు.

కాసుల పురుషోత్తమకవి ఆలుబిడ్డలు తెచ్చు ప్రఖ్యాతేగాని "మొదటి నుండియు నీవు దామోదరుడవె" అని ఆంధ్రవిష్ణువును ఎద్దేవా చేస్తాడు. దీన్ని కాటూరివారు పుణికి పుచ్చుకొన్నారభిమానంతో.

**అలంకారౌచిత్యం** :— రూపకాద్యలంకారాలు కావ్య సుందరికి శోభ చేకూరుస్తాయని, వనితావదనమెంత మనోజ్ఞంగా ఉన్నా అలంకార విరహితంగా అది ప్రకాశింపదని భామహుని వక్కాణ.

"రూపకాది రలంకార స్తథాన్యైర్బహుధోదితః
న కాంతమపి నిర్భూషం విభాతి వనితాననమ్"

అలంకారాలకోసమే కావ్యాలు రచించారు పూర్వం కొందరు కవులు. ఆధునికు లధికాలంకారాల గలగలల్ని గర్హిస్తారు. సముచితమైన అలంకార శోభ ఈ లఘుకావ్యంలో దర్శించవచ్చు రసాభిముఖంగా.

ఎత్తుగడలోనే సముద్ర వర్ణనం అత్యంత స్వభావోచితం. సముద్రుడు నురుగులు గ్రక్కటం, ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మిన్నుముట్టటం, వరుగులు ద్రొక్కటం, శీర్ణ కేశాలు, ఉద్బాహుత్వం స్వభావోక్త్యలంకారం. ఇది భయానక రసపోషకమైంది.

"రావణుడన్న కాళ్ళబడు రాయియు రవ్వయుగాదు" అనేపద్యంలో(23) 'లోక విద్రావణు డుగ్రవీర చరిత ప్రథితుండతిమానియౌ దశగ్రీవుడు' మొదలైన సాభిప్రాయ విశేషణాల వల్ల రావణుని ప్రతాపం విదితమౌతుంది. ఇతడు రామునితో పోరి గెలుపో, ఓటమో దక్క అన్యమార్గం త్రొక్కడన్న సత్యాన్ని విశేషణాలు ప్రకటిస్తున్నాయి కాబట్టి ఇందులో పరికరాలంకారం పొందుపడింది.

రూపకాలంకారాలు కోకొల్లలు. 'చిరవిరహాగ్ని' 'రావణాగ్ని' మొదలైనవి. 'నడచిచ్చుల గుండమువోలె' అన్నప్పుడుత్ప్రేక్ష రమ్యమైంది. (చూ. 40)

"సిరికొల్వు చవికియా వక్షమ్ము"— అన్నచోట (41) అభేదరూపకం.

"ఎట్లు! చెప్పవు? రాఘవుడే! మరేల?
విడువు కంపము, త్రోవరావిడువు మతని
నుజ సౌమిత్రితో, సూర్యతనయు తోడ
హనుమతో తరుచర వరూధినులతోడ" (5)

ఇందులో సహోక్త్యలంకారం రసాభిముఖమైంది. ఒక్క రాముడికే దారిమ్మనికాదు అతనితో ఒంటరిగా యుద్ధం చేయటం రాజనీతికాదు. తమ్ముడు, సుగ్రీవుడు, కోతులు అందరు రావాలి. అప్పుడే యుద్ధం. ఇది రావణుని వీరలక్షణం. శత్రునిశ్శేషం కావించటం పరాక్రమానికి నిదర్శనం.

ఇంకా భక్తిభావాన్ని తీసుకొంటే యీ అలంకారం ఎంతో అందగిస్తుంది. రాముడు తన స్వామి. ఆయన ప్రథమ భక్తుడు లక్ష్మణుడు. మిగతావాళ్ళు భక్తులే. భగవద్దర్శనంతోపాటు, భక్తమహాశయుల దర్శన భాగ్యానికి రావణు డుత్కంఠిస్తున్నాడన్నమాట.

వృత్తౌచిత్యం :— భావానుకూలమైన వృత్తాన్ని ఉపయోగించి రసవ్యంజకంగా రచన కావించటం మహాకవి లక్షణం. 40 పద్యాల పరిమితమైన ఈ లఘు కావ్యంలో ఛందోవైవిధ్యం అంతగా కనిపించదు. చంపకోత్పలమత్తేభ శార్దూల వృత్తాలు, సీస, కంద, గీతపద్యాలే ఉపయుక్తం. ఇవి తెలుగు కావ్యంలో సుప్రసిద్ధమైనవే.

తెలుగుకవుల్లో వృత్తౌచిత్యాన్ని బాగా పోషించినది ఆదికవే అనాలి. తరువాతి కవుల్లో ఆ ఆగ్రహం సన్నగిల్లింది. సంస్కృత కవుల చేతుల్లోకన్నా మిన్నగా రాణించాయి పై నాలుగు వృత్తాలు. ధీరగంభీర తీవ్రభావోద్వేగాన్ని ప్రకటించటానికి మత్తేభ శార్దూలాలత్యంత సమర్థాలు.

రావణుడు తన ప్రతాపాతిశయాన్ని ఆత్మాభిమానాన్ని, నిరాఘాటంగానూ, నిర్ద్వంద్వంగాను అతిశయ భావావేశంతోను ప్రకటిస్తాడు. కాటూరివారి చేతిలో అవి శార్దూల మత్తేభాలుగా ఉద్గమించటం ముదావహం.

పాతాళాధిపు లోకద్రోక్కితి (8)

శివకోదండము ద్రుంచె (9)

పతిభిక్షన్ శచికిచ్చి (36) ఇత్యాదులిట్టివి.

భయోద్వేగాన్ని 'సుంగుల్ గ్రక్కుచు' (1) అనే మత్తేభంలో నొత్తిగిల చేసారు.

చిన్నచిన్న పదాలతో ఆశ్చర్యాన్ని తేటగీతిలో నీటుగా ప్రకటించారీ రీతిగా :

"ఎట్లు! చెప్పవు? రాఘవుడే?? మరేల?
విమవ్రకంపము, క్రోవరావిభుడు వచ్చెనని" (5)

"ఎన్నాళ్ళకు! ఎన్నాళ్ళకు (6) అన్న కందపద్య నిర్వహణం అద్భుతోపేతమైంది. రావణుకు రామాగమనవార్త విన్నప్పుడెట్లా ప్రతిస్పందించింది సజీవభాషలో నిగదితం.

శ్రీరాముని విరహవేదనాన్ని సంస్మరించుకొంటు అతని దీనావస్థను తాను భావించి, పాఠకులచేత భావింపచేసే ఈ పద్యం ఉత్పల సౌరభాన్ని వెదజల్లుతుంది.

చూడుము నెచ్చెలీ! (24)

తన ప్రభువు సౌందర్యం 'శ్యామల కాంతిమోహనము' (28) అనే ఉత్పలమాలలో ఉన్మీలితం.

చిట్టచివరి రెండు పద్యాలు తేటగీతులు కావటం కేవలం యాదృచ్ఛికం అని భావించనక్కర్లేదు. కవి బుద్ధిపూర్వకంగానే నిర్వహించారనవచ్చు. ఉద్విగ్న

మనస్కుడై సుదీర్ఘంగా సంభావించిన రావణుని సమాప్త వాక్యాలు ఆతని హృదయాన్ని తేటతెల్లంచేసేభావాలు తేటగీతుల్లో మాధుర్యాన్ని ఊటలూరించేవి.

నిర్మలభావాంతః కరణుడైన కవి సత్వోద్వేగ పూరితుడై ఏ వృత్తాన్ని ప్రారంభిస్తాడో ఆ వృత్తం ఔచిత్యగర్భితమయ్యే ఉంటుంది. కవి భావనాగతి నాపరించిందే ఛందస్సు.

ధ్వని ప్రధానమైంది ఉత్తమోత్తమ కావ్యమనే ప్రాచ్యాలంకార పరిష్కారం తెలుసులేంది. 'రావణుడన్న గాళ్ళఁడు రాయియు రప్పయు గాదనే (23) పద్యం శబ్దశక్తి మూలక ధ్వని భరితమైంది. అందులోని రాయి, నాతి, కోతి, కాకి, గ్రద్ద లోకసామాన్యంగా ఇచ్చేఅర్థాల్ని అతిక్రమించి అహల్య, హనుమంతుడు, కాకాసురుడు, జటాయువు వంటి రామాయణ పాత్రల్ని వ్యంజనా వ్యాపారం చేత జ్ఞాపకంచేసి సహృదయుణ్ణి ఆనందభరితుణ్ణి కావిస్తాయి.

"చంద్రహాసమె శ్రీరామచంద్రునకును
నాకు ఘటియించుత మిథోవలోకనమ్ము" (29)

అనటంలో అందరాని చంద్రుడేరీతిగా అద్దంలో ప్రతిబింబించి బాలురకు కూడా అందుబాటవుతున్నాడో ఆదేరీతిగా రామచంద్రుడు తన కత్తివాదరలో ప్రతిబింబించి తన కరగ్రస్తుడౌతాడనే బాల మనోహర భావన ధ్వనిస్తుంది. చంద్ర శబ్దమిలా వ్యంజనా వ్యాపారానికి దోహదం చేస్తుంది. వైరభక్తిమూలాన రాముణ్ణి సమీపించి కౌగిలించుకొనే మహావకాశం తనకు లేదు. తన ప్రభువు దూరమైనా చంద్రహాసంలో ప్రతిబింబించి తనకత్యంత సన్నిహితుడే అవుతున్నాడనే ఆనంద భక్తిభావం అందుతుంది.

ఈ విధంగా ఎన్నో నిరూపించవచ్చు. తక్కువ రచించి ఎక్కువ ప్రభావం చూపే కవిగా కాటూరివారు ఆరాధనీయులు. ఎర్రాప్రగ్గడ కవితలా ఈయన కవిత సత్త్వోద్రేక ప్రధానమైంది.

సత్త్వోద్రేకాదఖండ స్వప్రకాశానంద చిన్మయః
వేద్యాంతర స్పర్శశూన్యో బ్రహ్మాస్వాద సహోదరః

## గుడిగంటలు

పౌలస్త్య హృదయమంత పరిమితిగల లఘుకావ్యమే గుడిగంటలుకూడా. తొలిది పౌరాణికం' మలిది సామాజికం. అందుచేత అధిక ప్రాముఖ్యంగలది. గాంధేయవాదిగా, సమాజస్పృహతో సరసంగా విరచితమైన ఈ కావ్యం ఆకాశవాణిలో అనేక పర్యాయాలు ఆలపితం కావటం చాలామంది ఆలకించే ఉంటారు.

తొలిదానివలె మలికావ్య శీర్షిక సముదాత్తమైంది. గుడిలోకి గంట మ్రోగించి ప్రవేశిస్తారు భక్తులు. ఎందుకిట్లా గంటలు మ్రోగించటం?

"ఆగమార్థంతు దేవానాం, గమనార్థంతు రక్షసాం
గురు ఘంటాధ్వని స్తత్ర, దేవతాహ్వాన లాంఛనమ్"

అని దీనికి ఆగమశాస్త్ర సమాధానం. దేవతలందరూ రావాలి అని, అక్కడఉండే బ్రహ్మరాక్షస పిశాచాలు పోవాలని, దేవతాహ్వాన లాంఛనంగా ఘంటారవం చేస్తారు. ఇది బాహ్యంగా చెప్పే అర్థం. ఇంతకన్న 'దేవాలయంలోకి ప్రవేశిస్తున్నామంటే మనసులో ఉన్న ఆసురభావాలు నిష్క్రమించి దివ్యభావాలు ప్రవేశించటానికి ఉపకరించే ధ్వనులుగా వీటిని భావించవచ్చు.

ఈ గంట ప్రణవనాదం. ఇది సకల సృష్టికి మూలభూతం. ఈ ప్రణవమిలా ప్రబోధిస్తుంది.

i] మమాత్మా సర్వభూతానామ్

ii] సర్వం ఖల్విదం బ్రహ్మ

iii] సమస్సర్వేషు భూతేషు

ఈ విధంగా 'సమస్త బుద్ధి విషయ బోధకాలైన ఉపనిషత్సూక్తుల్ని ప్రతిధ్వనింపజేసేవి గుడిగంటలుగా సంభావించవచ్చు నిరంతర జగచ్ఛ్రేయాన్ని సర్వజనావిరోధాన్ని, సర్వ జగన్మంగళాన్ని ప్రబోధించేవి యీ గుడిగంటల్లు. సంఘంలో క్రాంతమంది మానవులు ఇటువంటి గంటల్ని

ప్రయోగించే అవకాశం లేకపోవటానికి కవి గుండెగంట ఈ రీతిగా ప్రయోగింది. హరిజనులకు స్వామి సందర్శన సౌభాగ్యం లేకపోయిందని కవి గుండెలు ఆరాటంతో కావించిన నినాదాలే ఈ గుడిగంటలు. సహృదయ పాఠకుల హృదయాల్లో ఈ నినాదాలెంతో తీవ్రంగా ప్రతిధ్వనిస్తాయి.

హరిజన సమస్య :— సమాజంలోని అన్యాయాలకు, అసమానతలకు మిక్కిలి స్పందించి వాటిని రూపుమాపటానికి అహరహం ఆరాటపడి మానసిక పరివర్తన సాధించటానికి తన రచనద్వారా ప్రయత్నిస్తాడు, రచయిత. ఇట్టివే సామాజిక స్పృహాత్మక రచనలు. ఈనాడు శృంగార రసాత్మక రచనలు, పురాణకథలు కాక ఇటువంటి రచనలే అవసరం. సమాజంలో పుట్టి, పెరిగి, సమాజానికెంతో ఋణపడ్డాడు కవి. గాంధేయవాది, సామాజిక స్పృహ కల్గిన కాటూరివారు హరిజనుల్ని అస్పృశ్యుల్ని గావించి ఆలయాలలోకి ప్రవేశించగూడదనే నిషేధానికెంతో పరితాపం చెంది ఈ లఘుకావ్యం రచించారు. "అస్పృశ్యత మహాపాపం. ఈ మహాపాపాన్ని దేశభక్తులు తమ రక్తంతో క్షాళనం చేయాల"ని మహాత్ముడావేదించాడు. కాటూరివారికీ ఆవేదన ప్రేరణ అయి ఉంటుంది. అస్పృశ్యతను హిందూమతం అంగీకరిస్తే దాన్ని త్యజించటానికి తానేమాత్రం వెనుకాడనంటాడు గాంధీజీ. అస్పృశ్యతా నివారణకు మొట్టమొదట చేబట్టవలసిన కార్యం వారికి దేవాలయ ప్రవేశం కల్పించటం. అందరు భగవంతుని సంతతే. మనం వాళ్ళతో కలసి భోజనం చేస్తే చేయవచ్చు. వాళ్ళతో ఇచ్చిపుచ్చుకోటాలు జరగవచ్చు. మానవచ్చు. వారికి దేవాలయ ప్రవేశమైనా కల్పించటం మన కనీస ధర్మం. ఎందుకంటే ఆ ఆలయాలకు రాప్పు మోసి, చమటోడ్చి నిర్మాణం కావించినవాళ్ళు వాళ్ళే. ఇటువంటి భావ ప్రబోధానికి కదిలిన కవి కాటూరి. ఆ కవి తన ఇష్టదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామికే ఈ సమస్యానార్ద్రింగా నివేదిస్తు రచన సాగిస్తాడు.

శ్రీ వేంకటేశ్వరస్వామి నీరీతిగా మేలుకొలపటంతో కావ్య శ్రీకారం చుట్టబడుతుంది.

"వెలికవై జగమ్ములకు
నేడుమలల్ పయిరొమ్ము మీద శ్రీ
నీళలు జోలవాడ శయనించిన
దేవర! మేలుకో కృపా
వాల! శ్రితానుకూల!
శ్రుతిపారచర త్పదపద్మ! మేలుకో
నీల సరోజ పత్ర రమణీయ
విలోకన! మేలుకోగదే!"

మేలుకొని 'కొలువుసాలను దర్శనమిచ్చి యేలుకో!' యని అర్థిస్తాడు కవి. మునులతోపాటు, విప్రులు, వారితోపాటు హరిజనులు గూడా కూడి ఉన్నారు. వారికి ద్వారకవాటాలు తెరిపించమని వేడుకొంటాడు.

ఎంతో శ్రమకోర్చి స్వామి దర్శనార్థం ఆలుబిడ్డలతో ఈ హరిజనులు కొండలెక్కి వచ్చారు. ఇతర జనులు ఎన్నెన్నో కోర్కెలు మూటగట్టుకొని వస్తారు. ఆ మూటకు ప్రతీకగా ముడుపులర్పిస్తారు. కాని వీరో! భక్తజనులు. స్వామి శ్రీపాద సందర్శనం కోసమే వస్తారన్న ఈ క్రింది పద్యంలో కవి హరిజనుల నిష్కలంక నిష్కామ భక్తిని భంగ్యంతరంగా ఎలా ప్రశంసిస్తాడో చూడండి :

"అడుగుగరాదు రాచరిక
మాపద మొక్కులవారుగారు, నీ
కుడుగర లీయతే
రడుగ నొల్లరియర్థము వేడబోరు, వీ
రడిగిన దొక్కటే!
విరచితాంజలి మాలలు, మాలలెల్ల నీ
యుడుగుగవన్ ప్రసన్నజన
తార్తిహరమ్మును జూడనీకదే!"

ఈమధ్య పరిశోధకులు స్వామి విగ్రహాన్ని అనేక రీతులుగా అనుమా నించారు. ఏదింత తేల్చినవారు కారు. ఇంతకు పూర్వం స్వామి సౌందర్యాన్ని విన్నారే కాని కనులార గాంచలేదు. ఇప్పుడు వారికి కనువిందు గావించే తన 'త్రిజగత్కళ్యాణ రమ్యాకృతి'ని ప్రసాదించమని ప్రార్థించటంలో గల సూక్ష్మమైన వ్యంగ్యభావన సహృదయ వేద్యం :

"వినుమో దేవర! కొండపై
వెలసె గోవిందుండు వెంకన్న యం
చను కొంటే వినుచుంటెగా
కెరుగరయ్యా! జియ్యా! నీ రూపమున్
జినదేవుండవా! శక్తివో!!
శివుడవో!! శ్రీమద్వైకుంఠుండవో
కనువిందై కనుపింపరావె
త్రిజగత్కళ్యాణ రమ్యాకృతీ!!"

జిన స్వామి విగ్రహాన్నే ఇలా మార్చారని కొందరంటారు. 'బాలా' — అంటే అమ్మవారు. 'జీ' అంటే గౌరవ వాచకమై 'బాలాజీ' అయిందంటారు కొందరు. ఏదిఏమైన నేడాయన రూపం త్రిజగత్కళ్యాణరమ్యం. వీరికీ తర్కంతో పనిలేదు. స్వామి దర్శనభాగ్యం చాలనటంలో కవి గడుసుదనం గుర్తింప దగింది.

రాముడుగా అవతరించి అడవులన్నీ తిరగడం చేత అడుగులు బొబ్బలెత్తి ఉంటాయి. చదువుకొన్నవారు నిన్ను పరిశోధించేవారే గానీ, నీకు పరిచర్యలు చేసే దాస భక్తులీ హరిజనులొక్కరే. వారికా భాగ్యం కల్గించమని యిలా అభ్యర్థిస్తున్నాడు కవి :

"కొండల లోయలన్ దిరిగి
కోనల గుమ్మరి, తమ్ముగుర్రతో

నండజయానతో నడపులం
దటు ద్రిమ్మరి జాల్బలెత్తెనో!
పుండులు పడ్డవో చరణముల్?
త్రిజగచ్ఛరణమ్ము లోదయా
మండన! వీరికిమ్ము పద
మండన దాస్యము, చారితార్థ్యమున్"

దాస్యభక్తి వారి స్వభావోచితమైంది. ఎంతో నిపుణంగా చేస్తారు. ఎంతమందో భక్తు లసంఖ్యాకంగా స్వామిదర్శనం చేసుకొంటున్నారు. ఎన్నెన్నో, యేమేమో యాచిస్తున్నారు. 'ఈనాటి దన్కనీన్ని వాకిలిద్రొక్కి యీ హరిజనుల్కై సాచిరే? వీరలం జిన్నంబుచ్చుట దొడ్డ వేలుపులకిస్సీ వన్నెయో? వాసియో'? అని ప్రశ్నించటంలో హరిజనుల ఆత్మాభిమానంగా యిపొంచింది, కవీశ్వరుని ఆత్మాభిమానమే. ఈయన ఏ బిరుదాలిప్పించమని, సన్మానాలు చేయించమని తన యిష్టదైవాన్ని అర్థించినవాడు కాదు.

లోకంలో అధర్మం, అవినీతి విలయతాండవం చేస్తుంటే పాపంపండి పోతుంటే 'పవల్ రే లోకమైజరింప నిదురించెదవే వదిలమ్ముగా గుడిన్'? అని మోమోటం లేకుండా నిలదీస్తాడు కవి. గ్రామాల్లో, పురాల్లో ఘోర రాక్షస సంచారం అధికమైంది. నెత్తురు ద్రావుతున్నారు. వికట తాండవకేళి కావిస్తున్నారు. ఇటువంటి సమయంలో "ఇమ్మెయిన్ కోపెలలోన కన్మొగిచి, కూరుకు చెందకుమో జగత్పతీ!" అని ప్రభువునే హెచ్చరిస్తాడు కవి.

ఇంకా హృదయ దఘ్నమైన సామాజిక స్పృహతో కవి వేంకటేశ్వరులా వేంకటేశ్వరస్వామి నిట్లా నిర్భయంగా నిగ్గదీస్తాడు.

"కమ్మని పాయసాన్నములు
కస్తూరిపూతలు, కప్పూరంపు దీ
పమ్ములు పుణ్యధూపములు,
పైడినగల్ జలతారు పట్టుపు

టమ్ములు నిత్యభోగము
లొడఁబడి నీవిటు కొండ కొమ్మపై
నెమ్మది నున్నచో కడుపు
నిండునె? సాదకు కూటిపేదకున్"

ధనవంతుల కెట్లాగో కరుణలేదు. నీవైన ఈ పేదప్రజల దుర్దశకు కరిగి కటాక్షించకపోతే వీరిగతి యేంకావాలి? అందుకే కవి వారి దీనాతి దీనావస్థనిలా కనులకు కట్టేటట్లు అభివర్ణిస్తాడు.

"చీకటి కొంపలో బ్రదుకు,
చింకితలల్, మొయిగాటి పాత, పి
ల్లాకటి కింత సంకటియు
నంబలియున్, జవికింత యుప్పుగల్
వేకటి కింత చప్పిడియు,
వేకికి నుస్తుబునైన వీరిపై
నీ కరుణా కటాక్ష రస
నిస్సరణమ్ములు పొంగి పారుతన్"

కవి ఎంత భక్తుడైనా, భగవంతుడన్యాయంగా ప్రవర్తిస్తే సహించేవాడు కాడు. ఒకప్పుడు కాసుల పురుషోత్తమకవి శ్రీకాకుళంలోని ఆంధ్రనాయకస్వామి పుట్టు పూర్వోత్తరాలన్నీ రచ్చకీడ్చి ఆయన్ను క్రియోన్ముఖుణ్ణి కావిస్తాడు. ఇప్పుడీ కవి వేంకటేశ్వరునికే వేడి పుట్టిస్తున్నాడు. కార్మికశక్తులు విజృంభిస్తున్నాయి. భగవద్విశ్వాసం సన్నగిల్లుతున్నది. తాను కొండెక్కి కూర్చొని, తన అనుగ్రహాన్నంతా శ్రీమంతులకు విక్రయిస్తే సబబు కాదంటాడు, నిర్భయంగా,

"భయమే యీ గిరిమీద నిన్
నిలిపె, నాపన్మగ్నులే వచ్చి నీ
దయరొక్కమ్మిడి విల్తురేమిపుడు
ప్రత్యక్ష ప్రమాణాగమా

ధ్యయనాగారములంచు దెల్చితిమి
నీ తత్త్వంబు నల్లంత; వెం
కయసామీ! తొలినాళ్ళ బోలె నిక
సాగంబోవ వే భోగముల్".

దేవాలయాలు దోచుకొనే దొంగలెక్కువైనారు. పూర్వం సింహాచల స్వామివారి ఆలయాన్ని దోచుకోటానికి మహమ్మదీయులు దాడిచేస్తుంటే గోగులపాటి కూర్మనాథకవి స్వామిని ప్రబోధిస్తూ శతకం చెప్తే, మిడతలదండు పంపి స్వామి తన్ను రక్షించుకొన్నాడు. 'ఇంటిదొంగల్ని ఈశ్వరుడుకూడా పట్టలేడ'న్న మాట నిజమే అనిపిస్తుంది.

అన్ని పనులకు హరిజనులే. ఆలమందల్ని కాచి పాలుపితికి స్వామికర్పిస్తారు. ముక్కారులు పంటలు పండిస్తారు. గరిసెలు నింపుతారు. ఆలుబిడ్డలు పగలనక రాత్రనక స్వామి సేవానిర్మగ్నులై ఉంటే వారికి స్వామి దర్శనభాగ్యం కొరవడటం కవికి విచారం గల్గిస్తుంది. (39) తాను తిన్నాడో, పస్తులే ఉంటాడో, స్వామివారికి ముప్పొద్దులు నైవేద్యానికి కావలసినంత పంపించి ఇస్తాడు. తాను మైనిండ కట్టుకోటానికి నోచుకోకపోయినా స్వామికి దువ్వలువలు సమర్పిస్తాడు. నిరంతరం తనకూడిగం చేస్తున్నవారి క్షేమం తెలుసుకోని గొప్ప కామందుగా కవి స్వామిని అధిక్షేపిస్తాడు. (40) వాళ్లేమైనా అడుగవస్తే "గుడి దూరి గడియవైచి కూరుచుందువు కొండెక్కి గొప్పదొరవు" అని అనటంలో కార్మికులకు - యంత్రాగారాధిపతికి నిరంతరం సాగే సంఘర్షణ గంభీరంగా ధ్వనిస్తుంది.

కవి మొరాలించి స్వామి ప్రసన్నుడైనట్లు సంభావించి చివరలో స్వామి నభివర్ణించే పద్యాలు కవీశ్వరుని భక్తి పారవశ్యానికి మచ్చుతునకలు.

కవి భావన విస్తృతమై, విశ్వజనీనమై 'విశ్వమెల్ల గుడి మాకున్ నిన్ను సేవించుటల్" అనే నిర్ణయానికి వస్తాడు. విశ్వవ్యాప్త చైతన్యమైన కార్మికశక్తి భగవద్వ్యాప్తం. గృహమే దేవాలయం. అంతా భగవద్వ్యాప్తంగా భావించటమే పరిణతి అని కవి యిలా సూచిస్తాడు :

"ఆలుం బిడ్డల ప్రోపులో గలవు,
రోగార్తోపచారమ్ములో
జోలల్ వాడుచు నిద్రపుచ్చుటలలో
శోకాపనోదమ్ములో
నాలంగాచుటలో, బుభుక్షుకిడు
నాహారమ్ములో, కట్టియల్
గ్రీలంగొట్టెడి వ్రేటులో గలవు,
నీ వృత్తమ్ముకా సర్వమున్"

ఈ ప్రపంచమనే విశాల దేవాలయంలో తాను దాసుడుగా సేవలర్పించాలి, ఆ విశ్వమూర్తికని ఆరాటిస్తాడీరీతిగా :

"కసవున్ జిమ్మెద, నీరుజల్లెదను,
నీ కల్యాణగేహాన, బా
నసముంజేసెద, గట్టియల్ విరుతు
గింజల్ పొట్టుపోదంచెదన్
కుసుమాస్త్రంబులు వార్చి నీకిడెద,
అంట్లుం దోముదున్, వీవనల్
విసరన్, పాదము లొత్త నాకిడవె
తండ్రీ జన్మజన్మాలకున్"

ఇది ఈ కవీశ్వరుని ఆకాంక్ష - వేదాంతి కావాలని కాదు, ఆస్థానకవి కావాలని కాదు, వాదోపవాదాలు చేయాలనికాదు. దాస్య భక్తి నెరపాలనే కోర్కె ఒక్కటే. 'బంటురీతి కొలువియ్యవయ్య స్వామీ' అనేదే కోరిక. ఈ పద్యం చదువుతుంటే ఆముక్తమాల్యదలోని

"గృహ సమ్మార్జనమో!
జలాహరణమో! శృంగార పర్యంకికా
వహనమ్మో! వనమాలికా
హరణమో! వాల్లభ్యలభ్యధ్వజ

ప్రగహణమో! వ్యజనాత పత్రధృతియో
ప్రాగ్దీపికాగోపమో
నృహరీ! వాహనములేల? లేరె
యితరుల్ నీ లీలకున్ పాత్రముల్"

అనేపద్యం అప్రయత్నంగా మనోగోచరమౌతుంది.

**శైలి :—** కాటూరివారి వ్యక్తిత్వమే కాటూరివారి శైలి. సాధారణంగా శైలి రెండువిధాలు : [i] సమస్త పదశైలి. [ii] వ్యస్తపదశైలి. తొలిదానికన్న మలిది విశిష్టమైంది. ఎందుకంటే సమస్తపదశైలిలో శబ్దాలకు శబ్దాలకు సమన్వయం కావాలి. ఆ తరువాతగాని అర్థావగాహనం కల్గదు. అందుకు కొంత వ్యవధి పడుతుంది. అన్వయంలో భావం మసకబారవచ్చు. వ్యస్తపదశైలి సరాసరి హృదయానికి హత్తుకొంటుంది. ఈ రెండు లఘుకావ్యాల్లోను విశేషంగా వ్యస్తమైన అచ్చిక పదశైలి గోచరిస్తుంది. సమస్త పదాలైనా చాల పరిమితంగా విశేషార్థస్ఫూర్తికుపయుక్తం. ఈ కావ్యంకూడా వేంకటేశ్వరకవి శ్రీ వేంకటేశ్వరస్వామితో గావించిన సంభాషణం. అందుచేత సంభాషణాత్మకశైలి అనుసరించబడింది. అది వ్యస్తపదశైలిలోనే సాగుతుంది.

**ముగింపు :—** నూరు పద్యాలకు మించని రెండు లఘుకావ్యాల్నిబట్టి కాటూరి వారి అఖండ కవితాత్మను ప్రదర్శించటానికి యథాశక్తిని ప్రయత్నించాను. కొంతమంది కవులు తమ కావ్యాల్లో గొప్పగా కనిపిస్తారు. కొంతమంది తమ కావ్యాలకన్నా తామేమిన్నగా ఉన్నతంగా కనిపిస్తారు. కాటూరివారిట్టివారు. ఆయన అకలంకమూర్తి. అజాతశత్రువు. గాంధేయవాది. గురుభక్తి, దేశభక్తి, సోదరభక్తి, సఖ్యభక్తి సరసంగా సమ్మిళితమైన తేజోమూర్తి. రాక్షసుడిలోనే నిహితంగా ఉన్నమహిత భక్తిభావాన్ని సందర్శించిన సరసుడు.

ఆధునిక కవుల్లో కాటూరివారు ఎఱ్ఱాప్రెగ్గడ వంటివారు విస్మరింపరాని వినయ ధురంధరుడు. సాత్త్విక కవితావిస్ఫూర్తి గల సత్య శివ సుంధరుడు.

తక్కువ రచన - ఎక్కువ మెప్పు
ఎక్కువ రచన - తక్కువ మెప్పు
తక్కువ రచన - తక్కువ మెప్పు
ఎక్కువ రచన - ఎక్కువ మెప్పు

దీన్నే ఇట్లా చెప్పవచ్చు ఇంకోరీతిగా :

అల్పాక్షరాల్లో అనల్పార్థ రచన
అనల్పాక్షరాల్లో అల్పార్థ రచన
అల్పాక్షరాల్లో అల్పార్థ రచన
అనల్పాక్షరాల్లో అనల్పార్థ రచన

వీటిలో మొదటివాటినే ఆధునికు లభిలషిస్తారు. రచనలో కూడా పొదుపుపొడ చూపాలి.



# కవిసమ్రాట్ కృష్ణ కవితా కలాపం

"తల్లీ! నీసుతు విశ్వనాథు
కవితోదాత్తత్వ మగ్గింపగా
ఉల్లంబందున నిల్చి జృంభణముగా
నక్తుల్ సుశబ్దంబు లో
ఝిల్లంబల్కము నాదువాక్కనను
సంప్రీతిన్ రసోల్లాసినీ!
ఫుల్లాబ్జాక్షి! సరస్వతీ!
భగవతీ! పూర్ణావతారోజ్వలా"

*

తొల్లిటి పూజ్య సత్కవులతో
సరిమించు త్వదీయ శక్తిసం
ఫుల్ల విమాత్మ భావ పరిపోషిత
కృష్ణ కవిత్వ మాధురిన్
అల్లెముగొన్న ఆంధ్ర హృదయమ్ములు
నీ కివె విశ్వనాథ! వి
ద్వల్లతికా ర్యగణ్య! కవితా
మహనీయ! నమస్కరించెదన్.

* * *

ఆధునికాంధ్ర కవిత్రయంలో విశ్వనాథ వారిది తిక్కన సోమయాజిస్థానం. ఎందుకంటే తిక్కనలాగా ఈయన 'ఉభయకావ్య ప్రౌఢిపాటించే శిల్పంలో పారగుడు' 'కళావిదుడు'. అంతేకాదు. 'మహాకవిత్వ దీక్షావిధినొంది గద్యముల పద్యములన్ కృతులు రచించిన మనీషి. వాసి, రాశిగల కవిత్వం చెప్పి జాతీయ స్థాయికెక్కిన కవి విశ్వనాథ. కిన్నెరసాని పాటలతో ఆయన ఆంధ్ర సరస్వతి ఒడిలో జేర్చుకొని లాలించింది. ఆయన రామాయణ కల్పవృక్షంరాసి మహోన్నత కవిగా ఎంతోఎదిగినా, ఆతల్లి 'సత్యం! ఒక్కసారి ఆపాటలు పాడివినిపించవూ!' అనే అడుగుతుందేమో! ఎందుకంటే ప్రజా సరస్వతి అలాగే అభిలషించటం నేనెన్నో సభల్లో చూచాను. 'రామాయణం' వినిపించమని అడగరేమిటీ ప్రజలు? వీరువట్టి మూఢులని దూషించేవారు శ్రీ విశ్వనాథ. అయినా జనం అవివినటానికే ఆగ్రహించేది.

విశ్వనాథ ఇంతగా ఎదగటానికి కారణం విచారింపదగింది. తనతోపాటి వారు తనకన్న ప్రతిభా వ్యుత్పత్తులలో తక్కువవారే అయినా విశ్వవిద్యాలయాల్లో వారు ఆచార్య పదవులలంకరించారు. స్వతంత్ర స్వభావం గల తాను ఏసంస్థలోను కొనసాగలేక పోయినాడు. నిరుద్యోగంతో దారిద్ర్యంతో బాధపడుతున్న విశ్వనాథ అహరహం కృషిచేయవలసివచ్చింది. నవలలు, కావ్యాలు ఎన్నెన్నో ద్రవ్యం కోసం రచించాడు. Adversity is the mother of invention అనే ఆంగ్లోక్తి ఆయనకు బాగా అన్వయించింది. దారిద్ర్యశాపం ఆయనకు ప్రచ్ఛన్న వరమే అయింది. ఎన్నెన్ని సభల్లోనో ఉపన్యాసాలిచ్చాడు. తెలుగుపద్యం ఆయన నోటనే విని ఆనందించింది ఆంధ్ర జాతి.

'గిరికుమారుని ప్రేమగీతా'లతో భావకవిగా పేరుగాంచాడు. ఆరోజుల్లో భావకవికి ఖ్యాతికన్న అప్రఖ్యాతేమిన్న. నవ్యసాహిత్య పరిషత్తుతోను, సాహితీ సమితితోను సన్నిహిత సంబంధాలు కల్గినా వారి పరస్పర ప్రశంసలు, ముఖప్రీతి సంభావనలు ఆయనకు నచ్చినట్లులేదు. వాళ్ళందరిని ఒక్కచుట్టచుట్టి అవతల పడవేసే అసహాయ కవిశూరుడుగా కవితావిహాయసవీధిలో వీరవిహారంకావించాడు. తన శిరస్సును సహస్రశీర్షాలు కావించి, ఆంధ్రకవితా జగద్భారాన్ని వహించాడు.

తాను కవితా కల్పవృక్షమై బహుముఖీన కవితా శైలీ ఫలాలందించాడు. తక్కిన కవులందరు సమష్టిగా చేసుకోలేని ప్రచారాన్ని తానొక్కడు సాధించుకోగల్గాడు.

ఆయనది వైరభక్తి. అందరిని శత్రువుల్ని గావించుకొని ఆనందించే స్వభావం. నిండైనమనస్సు. అదినవ్యనవనీతసమానం. కానివల్కువాడి జాఖండల శస్త్రతుల్యం. ఇది విప్రస్వభావం. ఆయన నిజమైన విప్రుడు. ఆయన అపర రామకృష్ణకవి. 'మహాంధ్ర కవితా విద్యాబల ప్రౌఢి నాకెవరేరి?' అని ప్రశ్నించే ఆత్మవిశ్వాసమాయనది 'సరసార్ధ బోధఘటనా హేలా పరిష్కార శారద నీరూపము విశ్వనాథ కవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా!' అని మహాంధ్ర జాతిచేత అంజలి పట్టి చుకొన్నాడు. మహేతిహాసకవిగా మహితకీర్తి సంపాదించుకొన్నాడు జ్ఞానపీఠ బహుమానంతో ఆయన యశస్సు దశదశా పరివ్యాప్తమైంది.

"నివేరాజువు, నేను సత్కవిని
తండ్రీ! నిన్ను వర్ణించెదన్
నీ వేదైవము నేను భక్తుడను
తండ్రీ! నిన్నుధ్యానించెదన
నీవే భూమివి! నేను కర్షకుడ
తండ్రీ! నిన్ను పండించెదన్
నా వైదగ్ధ్యము నీవు చూతు
కృప సంధానించు విశ్వేశ్వరా!"

అని అర్థించాడు విశ్వనాథ. విశ్వేశ్వరుడు నిజంగానే కృప సంధానించాడు. కాని ఆసృష్టికర్తముందు తానెంత? ఆవేదాలముందు, ఆప్రణవంముందు తన కవిత్వ మెంత? అని ప్రశ్నించుకొని తన అల్పత్వానికిట్లా సిగ్గు పడతాడు.

"వాఙ్నైపుణ్యము, వృత్తిరీతి
రసభావౌచిత్య శయ్యార్థసం
లగ్నౌక్త్యంచిత లక్షణ
ధ్వని గుణాలంకారముల్ లేనినా

ఇగో న్విగ్న కవిత్వ మెంచగ
త్రయీనాదంబా? ఓంకారమా!
భగ్నారిధ్వజ! వేదపుం
కోసలా? నిన్ భాషింప విశ్వేశ్వరా!"

ఆ విశ్వస్రష్టతో తానైక్యం కావాలి అని ఆజీవుని పరిదేవనం. అందుకే అంటాడు.

"నా కవితన్ విశాల జఘనా?
ఒక యాచితి లేదు, భావ లే
దాకృతి లేద, యూరక
రసాత్మకనే స్రవియించి పోదు; నీ
వాకృతి యుందమాదిన
రసాత్మవు; నీకును నాక భిన్నతా
శ్రీ కత కద్దొనా పులకరించెను
జొమ్ము రిస ప్రపంచములో"

పరమేశ్వరునంతటి సృష్టికర్త కావాలని విశ్వనాథ జీవుని వేదన. అంతటి సృష్టి చేసాడు. సహృదయ లోకం దాన్ని పరిపరి విధాల పరిశోధిస్తున్నది. కొన్ని ఖర్వ ఒక పత్రికే వెలసింది, ఆయన సృజనమీద. తరగని వాఙ్మయ మాయసది.ఏకతార మీద కవితాలాపం ప్రారంభించిన విశ్వనాథ, కవితా విశ్వనాథుడై రుద్రవీణమీద కవితాగానం కావించాడు విశ్వవిజ్ఞాన బహురాకృతికి సమర్థుడైనాడు. కవితా కల్ప తరువై సహృదయు లాకాంక్షించిన వివిధ కవితారీతుల్ని చేకూర్చాడు. ఈనాడు విశ్వనాథకవితా విపంచి కృష్ణ ప్రణయ గానాన్ని ఎంతమధురంగా ఆలాపించిందో ఒకింత ఆలకిద్దాం.

శృంగార వీథి :— కావ్యంలో రచన రెండువిధాల సాగుతుంది. i) విరళరచన ii) కుసింపురచన. ఈ కావ్యంలోని రచన మొదటి పద్ధతికి చెందింది. అందువల్ల కావ్యం చదువుతుంటే హాయిగాసాగిపోతుంది. పద్యంబాధపెట్ట దెవరినీ. ఆయినా ఇతర కావ్యాల్లో కనిపించని సారళ్యం, అక్షర రమ్యత ఈకావ్యంలో అంతటా గోచరిస్తుంది.

భాగవతంలో ఎక్కడా రాధాదేవి ప్రస్తావన లేదు. అంతా గోపికల విషయమే. బ్రహ్మవైవర్త పురాణంలో గోలోకం, అక్కడి నిత్యరాస క్రీడలు అభివర్ణితం. చింతలపూడి యెల్లన శ్రీ కృష్ణ దేవరాయలవారి ఆస్థానానికి వెళ్ళి రాధామాధవ కావ్యాన్ని వినిపించి, రాధామాధవ కవి బిరుదాన్ని పొందాడనే ప్రశస్తి ఉంది ఇందులో రాధ పరకీయగా కాక స్వకీయగా నిరూపితం. ఈమె సహస్ర గోపుడనే వాని కూతురు. స్వయంవరంలో శ్రీ కృష్ణుణ్ణి వరిస్తుంది. రాధామాధవ సంవాదం, రాధికా సాంత్వనం వంటి రచనలు కొన్ని సాహిత్యంలో ప్రశస్తిగాంచాయి. పానుగంటివారి 'రాధాకృష్ణ' నాటకం స్మరింపదగింది.

రాధ పరకీయ అయితేనే అందం. విశ్వనాథవారట్లాగే ఇందులో పోషించారు. కథాప్రాధాన్యం కాక భావ ప్రాధాన్యం వహించిన కావ్యమిది. భావ కవితా లక్షణాలు, అంటే ఆత్మాశ్రయ ధర్మాలు పఠితను బాగా ఆకర్షిస్తాయి. నిఖిల రసామృత మూర్తియైన శ్రీకృష్ణుని నిర్భర ప్రేమాతిశయత్వాన్ని అందంగా అందించి తనకృష్ణభక్తికి అక్షరదర్పణాన్ని పట్టారు.

రసజగత్తు :— రాధాదేవి విరహవర్ణనతో ప్రారంభమౌతుందీ కావ్యం. ప్రియుడైన గోప రమణీ ప్రియునే రాధ స్మరిస్తుంది. విరహవేదన కామె 'తన్మ ముఖాంబుజం' వాడిపోతుంది. తనకుచద్వయంకంటే బృందారణ్యసీమావిహారమే నాథుని కిష్టమైంది కదా! అని చింతిస్తుంది. ఆ దివ్యపాదాల వింటాలెంత మహిమో పేతాలో ఇలా అభివర్ణిస్తాడు కవి!

శ్రీ దములై వికుంఠనగరీ ముఖకుడ్య
గతాత్మ దర్శనా
పాదిత సర్వమానిని జనవల్లభ
మోహకములై పురాసమా
స్వాదిత మత్సమర్పిత లసత్
పరిరంభ రసాబ్ధులౌ భవ
త్పాద సరోరుహానుభవ
భాగ్యము విస్మృతిరాదు మాధవా!

మానవుని ఉత్తమాంగం శీర్షం; కాని భగవంతుని ఉత్తమాంగం పాదాలు. అవి రసాబ్ధులు. వాటిలో మునిగి మునులు మోక్షం పొందుతారు. వీటిని ఆలింగనం చేసుకొని రాధ ఆనందాన్ని పొందుతున్నది. ఆ ఆనందానుభూతి తనకిప్పుడు దూరమైందని ఆమె పరిదేవన. 'కైశోర కేశవ పాదద్వయి' మివనే విశ్వనాథవారి రాధా భావన విశేషంగా లగ్నమౌతుంది. అందువల్ల పాఠకునిలో భక్తి భావన ప్రేరేపితమౌతుంది.

పారిజాతాపహరణంలో సత్యభామ తన వామపాదంతో తన్నినప్పుడు శ్రీ కృష్ణుడు నొచ్చుకొంటాడు. ఆమె సుకుమారపాదం తన కఠిన శిరస్సుకు తగిలి కందిపోతుందని. ఇక్కడ రాధ తన కఠిన వక్షోజ స్పర్శచేత ఆపసికాలు ఎంతగా కందిపోతుందో అని పరిపరివిధాల పరితపిస్తుంది. 'కాళియాహి చిక్కని పడగల్ హసించు చనుకట్టున, గజ్జెలు కల నిస్వనములు పల్కగా క్రొత్త అవి సెపూల వంటి పాదాలు మోపి' శ్రీ కృష్ణుడు రాధా కుచద్వయంమీద నటనసల్పే వాడట. అప్పుడామె ఒకసుఖానుభూతి ననుభవించింది. పీనపయోధర మర్దనంలో క్రొత్త క్రొత్త పద్ధతులెన్నో శృంగార వీధిలో ప్రవేశపెట్టారు శ్రీ విశ్వనాథ. ఈ భావాలు అక్షర రేఖాచిత్రాలు. ఇవి శ్రీ అడవి బాపిరాజు మృదులహస్తంలో రేఖాచిత్రాలుగా రూపొంది ఇందులో ముద్రితాలైనాయి.

రాధా విరహతాపాన్ని సహించలేక ఒక దూతిక నాథుణ్ణి తీసుకువస్తానని వెళ్ళి రాసకేళీ లీలాజనిత శ్రమాపనోదార్థ నికుంజాంతర నిషణ్ణుడైన వ్రజపతిని కాంచింది. హృదయం కరిగేటట్లుగా ఆమెతన రాధ దయనీయస్థితిని వర్ణించింది. 'పాండుకపోల భాగ నిష్ఠాత్య కవోష్ణ బాష్పయు స్తనద్వయ మధ్య పతన్మనోజ బాణాతి ప్రకంపమాన' అయిన రాధవంక చూడక పోవటం చాలా అన్యాయమని విన్నవించింది. రాధకుచాగ్ర భాగాల్లో శ్రీ కృష్ణుని పాదచిహ్నాలు రచించిందని రక్షలు కట్టిందని, కడకు తన దేహ శిఖినే ధూపంగా వేసిందని మాధవుడికి వివరిస్తుంది. స్మర బాధను తాళలేక మేనంతటా విభూతి నలదుకోని శైవమూర్తి అయిందట! చివరగా ఆమెచేస్తున్న జపాన్నిట్లా పేర్కొన్నది దూతి :

"దయచేయుం గదె నందగోపకుల
రాధాకృష్ణ! యంచున్ సదా
ప్రయతాత్మన్ జపియించుచున్నయది
బాష్పప్లుష్ట నేత్రద్వయిన్
శయనంబందున నంటుకొన్న యది
కార్శ్యంబంది యేకమ్మెన
య్యెయొ ప్రాభాతిక చంద్రరేఖవలె
కృష్ణా! వల్లవీ పల్లవా!

నిరాశ :— నెచ్చెలి రాకకోసం రాధ ఒళ్ళంతా కళ్ళుచేసుకొని నిరీక్షిస్తుంది. 'మృదులానిలాత్త శైరీష సువాసనాచ్ఛలహరీ నవరీతి పురస్సరంగా పురాప్రేషిత మైన చేటి వనవీధిని బడి వచ్చింది. రాధాలతాంగి చెచ్చెర చేరనరిగి చేగ్రుచ్చెత్తి యేమె యేమే? విచ్చేసెనెసామి? చెప్పవే? చెప్పవటే?? అని ఎంతో తీవ్రోత్కంఠతో అడుగుతుంది. దూతినోటమాట రానీకుండానే రాధ ప్రశ్నపరంపరల్ని కురిపిస్తుందిలా

"నా సందేశము తానెఱింగికొనెనా?
నామాట లాలించెనా??
రాసక్రీడలు మానెనా???
ఇచటకింరాగా తలంపూనెనా?!??"

తానందరికన్నా మిన్నననే అమాయికమైన ఆత్మప్రత్యయాన్ని రవ్వంతకూడా సడలించుకోకుండా రాధ ఇలా చాటుకొంటుంది.

"గోసంత్రాణ సుశీలు డచ్యుతుడు
నాకుం ప్రాణబంధుండు, నే
నాసంరక్షణ కేవ ప్రాణములకున్
ప్రాణంబనే నెచ్చెలీ!!"

ఈ అమాయికతే నవ్వుప్పిస్తుంది. జాలిగొలుపుతుంది. నెచ్చెలి మాత్రం తన రాధ ఉత్కంఠ, ఆశానిరీక్షణ పూర్తిగా తెలిసింది కాబట్టి మందహాసంకూడా చేయకుండా తీవ్ర కంఠంతో ఇలా సమాధానించింది, కనుకొనల్లో భాష్పములు జాలువారుతుండగా

"మారథసార్ద్వయంబువలె
షండల బద్ధ సహస్ర షోడశా
భీర కళై కహాపాన కభీత
మృగీసమలోచనా దృగం
భోరుహ చంచలా సహిత
మోహన తోయదమూర్తి వంశగ
ర్జారవ శీలికిన్ మనము
జ్ఞాపకమా! యదువంశమౌళికిన్"

ఎంత సరస మీ సమాధానం? ఎంతఉదాత్తం? ఎంతగావ్యంగ్య భావవిలసితం? తోయదమూర్తి అనటంచేత వట్టిజడుడని, ఎదిటివారిబాధ గ్రహించలేడని అర్థాంతరం. యదువంశం మూర్ఖమైంది. మూర్ఖమౌళియని భంగ్యంతరంగా చెప్పడంలోనెచ్చెలి గడుసుదనం, గోచరం. అంతమాత్రం లేకపోతే ఆమె రాధకెట్లా నెచ్చెలి అవుతుంది?

### గోకులుని గాథా సంస్మరణం :

నాథుడు రావటంలేదు. రాధ నిరాశచే మూర్ఛిల్లింది. ఉపచారాలుజరిగాయి. బృందావన రాసకేళీ గాథలు విని ఆనందించటమో! అసూయపడటమో? జరగాలి కదా! వినిపించమని కోరింది. నెఱజాణ నెచ్చెలి ముఖతః కవి విజృంభిస్తాడు. ఆ బృందావనంలో దిగంత వికాస చంద్రికాంకురపు వెల్లువలు విరిసాయి. అవి చూచి ఆవుదూడలు మధుక్షీరాలని భ్రమపడ్డాయి. వ్రజాంగనలు ప్రాణ పతిస్మేర మనుకొన్నాయి. అళిముగ్ధ కిశోరతతులు తెల్లని పద్మాలనుకొన్నాయి. ఇలాప్రకృతి వర్ణనం మనోజ్ఞంగా సాగుతుంది వీటికి రాధ చలించేదికాదు. శృంగారాభివర్ణన

చేస్తేనే ఆమె ఉలిక్కిపడేది. ఈ పద్యంవిని ఆమె ఎంత తపించి ఉంటుందో ఊహించలేం—

"ప్రాభాతాంబుజ శోణపత్రసమ
నేత్ర ద్వంద్వమై యొప్పు ప్ర
త్యాభీరద్వయ మధ్య కల్పిత
వినూత్నాంభోద మాలాలస
చ్ఛోభామూర్తిగ దివ్య షోడశ సహస్రో
ఢాంగనా పారిహా
ర్యాభోగంబున బాల కృష్ణు
సుషిరం బామ్నాయముల్ మ్రోగెడున్"

బాలకృష్ణుని పిల్లన గ్రోవిలో వేద నినాదాలు మారుమ్రోగాయట! సుషిరఅంటే గువ్వగుత్తిక అనీఅర్థం. చుంబన సమయంలో బాలకృష్ణుని కంఠం హీనమై అనుదాత్త స్వరంలో వేదమంత్రాలు చదువుతున్నట్లుగా ఉన్నదని కూడా భావించవచ్చు.

ఈ సందర్భంలో ఎక్కడైన పోతనగారి కవితా ప్రభావం ప్రసరించేదేమో అని అన్వేషిస్తే ఒక్క పద్యంలో గోచరించింది. అది

"తరుశాఖావలిఁ బక్షి సంతతులు
నాద బ్రహ్మమున్ మీలితాం
బురుహాంచన్నవ లోచనాంచలములన్
బూరించి ధ్యానించునో!
తరుణ శ్యామల ఘనమంద రుచిచేతన్
మానెనో! రమ్యకం
ధరముల్ పైకెగనెత్తి గోవితతి
చిత్రా మగ్నతన్ బొందెనో"

పోతన్నగారి పద్యాలు రెండిటి సంస్మరణీయం—

“ప్రతిజంబుల్ శాఖ లెక్కి మురళీ
శబ్దామృత స్యందమున్
మిగులన్ వీనులఁ ద్రావి
సోగుపడి నెమ్మిం గృష్ణు రూపంబు చి
త్రగమైయుండఁగ నడ్డపెట్టు క్రియ
నేత్రంబుల్ దగన్ మూసి యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే
మునిజనాకారంబులన్ గామినీ”

“మమతన్ మోములు మీఁది కెత్తుకొని
రోమంథంబు పాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణునిల్పి
మురళీగానామృత శ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేఁతమాని
గళితానందాశ్రులై చిత్రితో
పములై గోవులు సూచుచున్న
వఁగో పద్మాక్షి వీక్షించితే!”

విశ్వనాథవారు గోఖగ పారవశ్యాన్ని ఒక్క పద్యంలో వర్ణించారు. భాగవత భావం ఛాయామాత్రమే. ఎందరెందరి పద్యాలో తమకు కంఠస్థమైనా తన రచనలో వాటికి చోటుకూర్చని ప్రజ్ఞ విశ్వనాథవారిది.

సంయోగ శృంగారం :-

అప్పుడేదో దూతికను పలుకరించక పోయినా మాధవహృదయం రాధాయత్తం. ఆ సాయంతనమే కిశోరహరి తనంతతానే రాధాదేవి సౌధానికి వెళ్ళి శోకాంబుధిమగ్నమైన రాధను గాద్గద్యం దీపించగా పేరెత్తి పలుకరించాడు,

ప్రాణాధారమైన ఆ పలుకుకు పులకరించింది రాధ. బాష్పప్లవన్నే త్రుణ్ణీ విలోకించింది. తన కన్నులు చెమర్చాయి. ఆ నిమిషంలోనే తాను నిర్దయత్వంతో కల్గించిన విప్రయోగ దుఃఖాన్ని విస్మరింపజేస్తాడు కృష్ణుడు. ఇరువురు ప్రసారిత భుజాంతర లగ్న పరస్పరాంగులైనారు. ఇక్కడ శృంగార చేష్టల వర్ణనలో విశ్వనాథ వారు సిద్ధహస్తులు. రాధను చిన్ని కృష్ణుడు వీపున మోస్తాడు. చిటికిన వ్రేలిమీద పర్వతాన్నే ఎత్తిన కన్నయ్య కిదో లెక్క గాదుగాని రాధ వయస్సులో పెద్దది. ఆమె చిన్నికృష్ణుణ్ణి ఎత్తుకొని శృంగార చేష్టలు చేస్తు నేర్పిస్తే అన్నీ తెలిసీ,తెలియనట్లు నటిస్తున్నట్లు బాలకృష్ణునిచేత అభినయింప చేయిస్తే ముచ్చటగా ఉండేదేమో! అని నాకనిపిస్తుంది. రాధ నడవలేదని బాధపడుతుందని బాలుడైన కృష్ణుడు బాధపడటాన్ని వర్ణించటంలో విశ్వనాథ వారికి స్త్రీపట్లగల సహజమైన సానుభూతే విదితం. ఇక్కడి వర్ణనలు చాలవరకు ప్రబంధోచితాలే. ఉదాత్తశ్రీ అంతగా గోచరించదు.

శ్రీ కృష్ణ నిర్వేదం :-

అష్టభార్యలు, షోడశసహస్ర గోపికలు. ఇంతమంది భోగ్యవస్తువులున్నా లోకం అబ్బో అని ఆశ్చర్యపడటమేకాని శ్రీ కృష్ణునకు మాత్రం నిర్వేదమే మిగిలింది. ఆయనకు సంతృప్తి లేదు. ఆయన్నెవరు సంతృప్తి పరచగలరు? అటువంటి సమయంలో రాధ మందాకినిలాగా ముందుకువచ్చింది – వినూత నాకృతితో. ఆమె తన నిర్వేదాన్ని తీర్చగలదని ఆశించాడాయన. ఆమెనెట్లా అనుభవించాలని ఆరాట పడతాడీకవి తన శృంగార భావననంతా ఒలకబోస్తాడు. ఒక్క పద్యం చవి చూద్దాం :

ఓ వలినీటి తుంపురుల యోవరి!
వేపుడిసిళ్ళుపట్టి నిన్
ద్రావుదునో! మెయిన్ విరహ
తాపము నారగ బోసికొందునో!
బావులయెల్ల నీదుతను
భావమునందున దూకు వెట్టి స్వే

చ్ఛావధిగాఁగ గ్రోఁబుడఁగ లోఁగతి
మున్గుచు తేలుచుందునో!

ఈ విధంగా రాధాకృష్ణుల శృంగారాన్ని వీధికెక్కించి (ఆకాశానికి అంటించి) తద్రసాన్ని ఇత్తికబంటిగా ఆస్వాదింపజేస్తారు, శ్రీవిశ్వనాథ.

ప్రాతస్స్తవం :- శృంగారవీధిలోని ఖండికలన్నీ ఒకయెత్తు, 'ప్రాతస్స్తవం' ఒకటి ఒక యెత్తు. ఇది సుప్రభాతాల యుగం. నిర్నిద్రుడైన భగవంతుని నిద్ర పుచ్చటం, నిద్ర మేల్కొల్పటం భక్తులకు నిత్య కార్యక్రమాలైనాయి. సుప్రభాతాల కన్నిటికీ మకుటాయమానమైంది- శ్రీ వేంకటేశ్వరసుప్రభాతం దానికి కూడా మూలమైంది, వాల్మీకి రామాయణంలోని ఈ రెండు శ్లోకాలు :

"కౌసల్యా సుప్రజ! రామ!!
పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ! నరశార్దూల!
కర్తవ్యం దైవమాహ్నికమ్"

"ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద!
ఉత్తిష్ఠ గరుడధ్వజ!!
ఉత్తిష్ఠ కమలాకాన్త
త్రైలోక్యం మంగళంకురు"

ఇవి మానవాకారుడైన భగవంతుణ్ణి విశ్వామిత్రుడు మేల్కొల్పిన శ్లోకాలు. ఇంతకుపూర్వం వాత్సల్య భావానుభూతుల్లేని విశ్వామిత్రుడు ఆకొరత యిప్పుడిట్లా తీర్చుకొని ఆనందించాడు.

రాముణ్ణి కౌసల్య ఎలా మేల్కొల్పిందో ఎక్కడా నిరూపితంకాలేదు. కాని వాల్మీకి విశ్వామిత్రుడి పట్ల నిరూపించి ఆయనలో ఉప్పొంగుతున్న వాత్సల్య భావాన్నిలా ధ్వనింపజేసాడనిపిస్తుంది.

అయితే శ్రీ కృష్ణుని యశోద ఎలా నిద్ర మేల్కొల్పిందో భాగవతంలో లేదు. ఆమె మేల్కొల్పేలోపలే ఆయన అల్లరిచేయటానికి లేచిపోయి ఉంటాడు. విశ్వనాథవారీ సందర్భాన్ని పురస్కరించుకొని ప్రాశస్త్యాన్ని రచించిఆకొరత తీర్చాడు. శృంగార భావాల సుడిగుండంలోపడి సతమతమౌతున్న పాఠకుల్ని కవి సంరక్షించాడనే అనాలి.

బాల మనస్తత్వం బాగా తెలియాలి, నిద్ర లేపాలంటే. అందులోను బాలకృష్ణుణ్ణి నిద్రమేల్కొల్పటం గొప్పకళ. విశ్వనాథ ఇందులోను తన ప్రావీణ్యాన్ని ప్రదర్శించాడు.

పిల్లల్లో పోటీ స్వభావం బాగా వుంటుంది అన్నయ్యయమునానదిలో స్నానానికి వెళ్ళాడు ఎప్పుడో! నీవింకావెళ్ళవేం? అంటు యశోద ఈరీతిగా మేలుకొలుపులు ప్రారంభిస్తుంది.

"లే! యింకన్ నిదురించుటేమిటిర?
లేలే చిట్టినాతండ్రి' కృ
ష్ణా! యన్నాయి కళిందజాపులిన
దేశ క్రీడనార్థమ్ము న
ష్టే యేగెన్, మఱి నీవుకూడ చనవా?
వేగమ్ము లేవయ్య తం
డ్రీ! యాదిత్యనవాంశువుల్
పసుపు పండించెన్ గవాక్షమ్మునన్"

కిటికీలోనుండి బాలభాస్కర కిరణాలు చొచ్చుకొని రావటాన్ని పసుపు పండటమనటం గొప్పభావచిత్రం.

బలరాముడు బుద్ధిమంతుడు. పుస్తకంలాగా పడుకొంటాడు. కొంటెకృష్ణుడు ప్రక్కంతా క్రుమ్మి ప్రక్కోచోట తానోచోట పడుకొంటాడు.

బాలకృష్ణుడు నిద్ర లేవకపోతే తనఇల్లేకాదు, ఊరంతా బోసి పోతోంది. సందుల్లో గొందుల్లో సందడేలేదు. బెమ్మంటుంది.

"ఇదిగో తండ్రికి చిట్టినవ్వుదయమయ్యెన్
లే! యదూత్తంస! నీ
వాదగం బోవని సాదుసందులకునై
యూరెల్లఁదా నేడ్చెడున్
గద నీ యల్లరిలేక; గజ్జెలు ఘల్లుఘల్లా
గృహమెల్లద్రో
క్కెడు నాట్యమ్ముల లేవవయ్య ప్రభువా!
కృష్ణా!! యశోదాత్మజా!."

త్వరగా నిద్ర మేల్కొంటే ఏవిధంగా తనివితీర అలంకరిస్తానంటుందో చూడండి :

"ప్రిదులని చంద్రవంక
సవరించెద, రత్నపురావిరేకఁబైఁ
కుదురుగ నిల్పుదాన,
జడకుప్పెలు వేసెద జుత్తుదువ్వి, యీ
నిదురను మాని పైడి
బరణింబలె మెల్లగ లేచి రమ్మునా
మొదగల యింద్ర నీలమణి
యేడిర? యల్లదె మెల్ల లేచెడున్"

నిద్రగాని నిద్ర పోతావెందుకు? గ్రామంలో కయ్యాలు మిగిలిపోయాయి, త్వరగా లెమ్మంటుంది తల్లి. ఆ మాటల కతడు ముఖంచిట్లించుకోని, బుద్ధమూతిపెట్టుకోని దుప్పటి గట్టిగా బిగించుకొంటాడు. అప్పుడు బ్రతిమాలుతుంది ఇలా—

"అయ్యా! కోపము వద్దులే. యనను లే.
జో, పడి ఖిన్నావులే
సయ్యాటమ్ముగ నంటిలే
యదుకులస్వామీ! రమావల్లభా!!"

"గరుడాళువారిపై వేల్పు బువ్వవస్తున్నది. వేగంగా తీసుకోండి" అంటుంది, యశోద. అప్పుడు యదు వీరుడు కనుదమ్ములు విచ్చుతాడు. ఇంకొక చిత్రం. గుమ్మపాల గోవమ్మ కోపంగా తన బిడ్డవంక చూచి పొడవబోతుంది. ఎందుకు? త్వరగా పాలుతాగాలని దూడఆరాటం. కన్నయ్య త్రాగంది ముందుగా తన బిడ్డను కూడా పాలు త్రాగనీయనంటుంది. దాని భక్తి ఎంత ఘనమైందిగా వర్ణితమో!

"చిమ్ముల దూడవంక నెగ
జిమ్మెడు కోరల కన్నుదోయి తో
గుమ్మము వద్దనున్న దదగో!
కను, నీకయి గుమ్మపాల గో
వమ్మ, మరీవు త్రాగకయ
యాతన దూడను గూడ త్రావనీ
దమ్మ! మరింక లే, నురుసు
లారక మున్నె త్రావగావలెన్"

జగమంతా ద్వారంవద్దనే వేచిఉన్నది, లెమ్మంటుంది. ముసుగుతీసి ఒక్క చిరునవ్వు చిందిస్తాడు కన్నయ్య. దానికామె పరవశిస్తుంది. మళ్ళీ ఇలా మొదలుపెడుతుంది:

ఈ మొల నవ్వులో జనని
యెంతటి కోపము పోవునందు నీ
కే యెదలో నెరుంగుదువు లే!
పసిదొంగ! మరింక చాలు, లే
వోయి బడాయి! లేవగదవోయి!
ఘనం కుమార కన్న తం
డ్రీ! యదువృద్ధ లోచన
మణిచ్ఛవి భూత శరీరవల్లరీ!'

విశ్వనాథవారి సంబోధనలు చాలా విశిష్టంగా ఉంటాయి. ఇవి నిద్రమేల్కొల్పే

టప్పుడు మరింత సాభిప్రాయంగా ఉంటాయి. చిన్నచిన్నవి. పెద్దపెద్దవి. సహృదయుణ్ణి ఆలోచనలో ముంచెత్తేవి.

నిద్రమేల్కొల్పటం గొప్పకళ. అందులోను ఆ చిన్నికృష్ణుణ్ణి బ్రతిమలాడాలి. ప్రాధేయపడాలి. మభ్యపెట్టాలి, కాసేపు బెదిరించాలి. రెచ్చగొట్టాలి. మోతాదెక్కువైతే మళ్ళీ కాళ్ళ బేరానికి రావాలి. ఆ యశోదమ్మ ఆ చిన్ని మగవాణ్ణి కని ఎన్ని తిప్పలు పడ్డదో వర్ణనాతీతం. ఎలా బెదిరిస్తుందో చూడండి:

"అంతేకావలె, నిద్ర మేల్కొనవు, నీ
ఉన్నాయి తావచ్చి యీ
అంతా మీగడ పాలు వెన్న తిని
యుద్దే చెప్పకుండన్ జనెన్
సంతోషించితి, కండ్లు చల్లపడె
కన్నా! లేవరా యంచు నే
నెంతేనిం బ్రతిమాలుచుంటినను
నీ విం తేని విన్నావురా!"

"రాత్రల్లా నిద్రపట్టినట్లులేదే. కడుపుబ్బరించినట్లున్నదే! అవునులే ఉట్లన్నీ ఖాళీ చేస్తే ఉండదా! కళ్ళు ఎర్రవారి ఉన్నాయి." అంటు ఇలా బ్రతిమాలు కొంటుంది ఆ తల్లి :

"మేతకరిబుద్ధు లెంతకును
మానవు, నిన్నాన బట్టి యాప బ్ర
హ్మాతరము కాదు, నా కడుపునం
దెటుపుట్టితివోయి? చాలు, నా
మెతకతనమ్ముగాక పుడమిన్
నినువంటి కుమారులుండు రే?
యతివ గయాళిమూక యిపుడై
పడిపోవును వచ్చి నా పయిన్"

ఆయనన్నేదోతాను కన్నట్లుగా బాధపడుతుందా తల్లి. అక్కడేఉంది చమత్కారం. అటువంటి కుమారుడెక్కడుంటాడు? అతనికతడేసాటి. తన పిల్లవాడు మంచివాడే ప్రతి తల్లికి. లోకులపిల్లలే అల్లరిమూకలు వాళ్ళ సావాసం చేయవద్దని ఇలా హెచ్చరిస్తుంది. :

"గొల్లల గూడెముల్ తడక గొంపలు
తల్పులులేవు, నీవు ద్రే
పల్లెకు మేటివైతి వాక
పాతిక ద్రోతులు నీకుఁదోడు, మీ
రెల్లనునట్లకెక్కు పనికే మొ
హాజూర్సరదారులైరి యీ
పిల్లలతోడ నింక కనుపింపుము
యింకొకమారు చెప్పెదన్"

తడకలు కాకపోతే, తలుపులు గొళ్ళేలు తీయలేనంత అసమర్థులా? ఆరితేరిన దొంగలకిదోలెక్క? జమా? పాపం తల్లి ప్రాణంకదా! అట్లా అనుకొంటుంది. ఆ సహజధర్మాన్ని పోషించటమే ఉత్తమకవితా లక్షణం.

రాత్రిళ్ళు ఈ రీతిగా తిరుగుతుంటే ప్రమాదాలుంటాయి గదా! తిరగ వద్దంటే వినిపించుకోడు. తిరిగి తిరిగి కాళింది హ్రదంలో పడ్డాడు. ఆసంఘటన స్మరణకు వస్తే తల్లడిల్లి పోతుందా తల్లిగుండె. ఎంతచెప్పినా "నీ చేతము సుంతయున్ గుణముచెందదురా! నవనీతలుబ్ధుడా!" అంటుండి. గుణాతీతుడైనవాడు గుణవంతుడెట్లా అవుతాడు? నవనీతంపైని ఆతని కట్టిది, లుబ్ధత్వం. 'తోడుకోని పెరుగులు దోచుకొంటే కూడుకొంటున్న కాపురాలు కూలిపోతాయని సామెత.' అట్లాకాకుండా ఉండాలనే నవనీత లుబ్ధుడైనాడేమో!!

ఈ మాటలంటుంటే కన్నయ్యకు ఏడుపువస్తుంది. దొంగేడుపు పట్టి కూని రాగాలు. కళ్ళవెంట నీళ్ళు రావటం లేదని అనుకొంటుండగానే, నీళ్ళుకూడా తెప్పించాడా నటోత్తంసుడు. తిరిగి యిలా ప్రతిమాలింది యశోద.

"మా నాయనగా వేడ్కకు
మా నాయనగారు చూడ మాంధాతగదే
లేనివిపో నపవాదులు
కానీ, మా తండ్రి యిల్లు కదలడుగదవే"

ఇక్కడ తల్లి లాలనను విశ్వనాథ వారెంత స్వభావోచితంగా సంతరించారో! ఆ పద్యాలత్యంత హృద్యాలు :

"ఎవరా బాబును గూర్చి యిట్లనిరి!
బాబెచ్చోటికిం బోయె! రే
జవలున్ నా యొడిలోన నుండునుగదే!
బంగారు నాతండ్రి, ఆఁ,
యెవరో గిట్టనివారలందరు
శిశూ! నేనెత్తికొందున్ నినున్
జివ్వకుం గేల్మోడ్చి ముద్దుపెట్టుకొనరా!
చిట్టీ! నవంజెక్కిటన్"

తామెవ్వారలు తండ్రి నిట్లనిరి ?
నే దండించెదన్ వారలన్
రా! మా బంగరు నాన్న యెత్తు
కొనెదన్ రావయ్య కృష్ణయ్య, యే
డీ! మా యాదవవంశ దీపమణి
యేడీ చిన్నినందయ్య యే
డీ! మా వేల్పులకెల్ల వేల్పుదొర
యేడీ! వాడు నీవా ప్రభూ!

ఇది రసోద్గార కవిత. యశోదతో తాదాత్మ్యం చెందగా ప్రభవించింది.

అప్పటికి లేచాడు కన్నయ్య ఏవిధంగా? బంగరుమువ్వల గమి, రత్నాల గజ్జియల పేట, నెఱినగిషీల యందియల జంట, కేల్జత హొన్నుగంటలవడి, ఒక్కమారునినదింపగా

యదుకులోద్యాన కేకి నాట్యమ్ముచేసె
నంద గర్భ సరోహంస నడలు నేర్చె
నెమ్మి నాట్యమాడెను యశోదమ్మ కొడుకు
అంచ నడకలు నడచె క్రిష్ణమ్మగారు.

బ్రహ్మగీతము : అనేక భాగవత ప్రసంగాలలో వాత్సల్యభక్తికి లక్ష్యాలుగా 'ప్రాతస్స్తవం' పద్యాలు అతిభాగవతమని వినిపించే వాణ్ణి. ఇంతకన్నా మిన్నగా నాహృదయానికి హత్తుకొన్నవి శీర్షికలోని పద్యాలు. ఇవి మధురభక్తి ప్రఫుల్లాలు. ఆత్మాశ్రయ వికసితాలు. జీవుని వేదనోల్బణాలు.

పోతనార్యుని 'బ్రహ్మగాంధర్వగీతంబు పరగజేసె చతురనటమూర్తి గోపాల చక్రవర్తి' అన్నపాదాల్ని పురస్కరించుకొని 'బ్రహ్మగీతమ'నే శీర్షిక ఏర్పడిఉండవచ్చు.

'పరువు పరువున పోవునెదతో
పరువులెత్తితి మరచినేనే
మరచి సర్వము, నన్నునేనే
మరచి నడిరేయిన్'

అన్నారుకృష్ణశాస్త్రిగారు. ఇలా వేలాది గోపికలువస్తే శ్రీకృష్ణుడు వాళ్ళను సరిగా ఆదరించలేదని ఆవేదన పడతాడుకవి. నాకు తెలిసినంత మేరకు శ్రీకృష్ణుణ్ణిలా ఉపాలంభించిన తెలుగుకవిలేడు.

"వేణువు బ్రహ్మగీతము
చెవింబడెనో స్మృతితప్పి గోపికా
శ్రేణులు నీ పదం బభిలషించిరి
గేహములుం దనూజులున్

ప్రాణపతుల్ తదీయ
విరహాగ్నికి నేమయినారో? యెంత పా
షాణుడవో! పురానుగత
సంధులు ప్రయ్యలు సేయమాధవా!

గోపికలు కావించింది ఎంతో సాహసం. సాంఘికధర్మ విరుద్ధం. వారి కామోత్కంఠత ఆవిధంగా వారిచేత ధర్మోల్లంఘనం కావింపచేసింది. ఎంతో త్యాగానికి ఒడికట్టించింది. ధర్మాలు సామాన్యులకే, అసాధారణ మనఃప్రవృత్తి గలవారికివి అనువర్తించవు.

'ఎంతపాషాణుడవో!' అంటే అనేకాలోచనలు రేకెత్తుతాయి. అవికారుడని ద్వంద్వాతీతుడని.

కన్నీరు మున్నీరుగా ప్రవహిస్తున్నది గోపికలకు. దోసిళ్ళలో పట్టినంత వరకు పట్టుకొన్నారు. కన్నీరునిండిన కళ్ళకు దారెట్లా కనిపిస్తుంది.? అందులోను అర్ధరాత్రి. వాళ్ళచావు వాళ్ళు చస్తారులేయని ఎక్కడో దాక్కొని నిమ్మకునీరెత్తి నట్లుగా ఉండటం ఏమి భావ్యం? అది కరుడుగట్టిన స్వార్థంకాదా అని నిలబెట్టి అడుగుతాడు కవి ఈ రీతిగా :

"దొనదొనజారు బాష్పములు
దోసిటబూని, భవత్పదాభిషే
క నియతి వచ్చుచున్న వ్రజ
కన్యలు బృందము త్రోవదప్పిరో
యని మదినైన నెంచవవురా!
తటి చిక్కని గుమ్మపాలు త్రా
వన చిఱు బొజ్జలో కలక
వెట్టదురా? జగదేక సుందరా!"

గోపికలకు ఎదురుగా స్వాగత మివ్వలేదని కవిచాలా బాధపడతాడు. ఏమిలేని నీయెదకోసం ఎందుకీపరుగులు? "వెట్టిగొల్లరీ మదవతులెంతకెంత కభిమానము

చచ్చిరిరా వ్రజేశ్వరా?" అనేపద్యాన్నొక గ్రామంలో సభలో చదివితే "మావాళ్ళను మదవతులంటావా" అని ఒక యాదవుడు కర్ర తీసుకొని మీదమీదకువచ్చాడు. "ఆయన కాదయ్యా అన్నది — ఎవరోకవి" అనిఎవరో సర్దబోతే "ఈయనెందుకు చదవాలా పద్యం" అని ఉద్రేకించాడు. అది సహజమే.

ఈ కవీశ్వరుని కృష్ణభక్తి కవితలాపం మధురాతి మధురంగా సాగింది. 'గోపికాగీత' అనే కావ్యంలో. అందులో రాసక్రీడానంతరం గోపిక ఉత్కంఠతో శ్రీ కృష్ణుణ్ణేరీతిగా తిరిగిపొందాలని, సుదీర్ఘంగా చింతిస్తారు. అది 'చింతా ఖండము' ఆయన్ను అన్వేషిస్తారెంతో తమకంతో. అది 'అన్వేషణా ఖండము'. కడకు ఆ జగదేక సుందరుని సాక్షాత్కారాన్ని పొంది తరిస్తారు. అది 'సాక్షాత్కార ఖండము' భాగవతంలో పరిమితంగా సాగిన ఈ యితివృత్తం రసాతిరేకంగా అయిదువందల పద్యాల్లో ప్రపంచితమైంది. ఇందులోని టిప్పణపతితల కర్తృగ్రహణంలో సహాయికారి.

చింత : బృందావనంలో రాసలీలా నంతరం అచ్యుతుడదృశ్యుడౌతాడు. గోపికలందరు చింతాక్రాన్తలౌతారు. ఇల్లు వాకిండ్లు వదలి వచ్చారు. ఇక్కడ దిక్కులేని వాళ్ళయినారు. తిరిగి యింటికి పోవటానికి ముఖం చెల్లకుంలేదు. భాగవతంలో ఎంతో రసవత్తరంగా సాగిన యీ అంశాన్ని మళ్ళీ ఇంకోకవిచేబట్టి రచించటానికి ఉద్యమించటం ఎంతో సాహసం. అటువంటి సాహసోపేతుడే ఆధునిక కవుల్లో విశ్వనాథ ఒక్కడే.

షోడశసహస్ర గోపికావితతి ఒక్క మారు చుట్టుముట్టి 'పరిప్రార్థనా కృపణత్వా'న్ని పొందితే తట్టుకోలేక ఏకోనకోపోయి ఉంటాడని ఒక గోపిక భావించింది.

శ్రీ హరిని ఎలాదర్శించాలి? అనే పరిప్రశ్ననిలా కావిస్తుందో గోపిక :

"కడు విలపించి శ్రీ హరిని గాంతుమొ?
మౌనము దాల్చి కాంతుమో?
బుధతని రూపమున్ ఋషుల పోలిక
వర్ణన సేసి కాంతుమో?

యెడద తపించి కాంతుమొ?

మరింతయు నాకును పాలువోద యీ

యొడలు త్యజించినంత హరి

యూహను చేయను లేమ! యేమిశే?"

భగవ దపరోక్షానుభూతి మార్గాగీరీతిగా సూచితాలు. మనమెప్పుడు ఆయ కోసం తపించటమేకాని ఆయనకు మనమీద అనురాగం లేదని ఆక్రోశిస్తుంది గోపిక. 'తన వారని లేదుగదే మురారికిన్' అని నిట్టూరుస్తుంది. మమత వ్యామో రహితుడు, భగవంతుడన్నమాట.

యశోదాదేవి యింటికేగి చూడకుండా ఆలమందల్లో ఉన్నాడే ఆలోచించకుండా "యీ కాననంబున నీచెట్టులబుట్టలం దిరుగుటేమో? ఇ మిందున్నదా?" అని ఒక గోపిక సూచన. శ్రీ కృష్ణుని హ్లాదనీ శక్తే రాధ. రా కృష్ణుడికి భేదం లేదు. సకల ప్రాణుల్లోనిది కృష్ణచైతన్యమే. దాన్ని సాక్షా రింపజేసుకోవాలనే సాధన మార్గం ధ్వనితం.

ఈ వ్రజసమూహం సర్వం యమునానదిలో పడిచావటం శ్రీ రమా కభీష్టమేమో? లేక పోతే మనందరిని వేణువూది యిక్కడికెందుకలాగుతాడ సందేహిస్తుంది యింకో వ్రజకన్య. "యదుసింహుణ్ణి వెదకికొంటు, ఎంద పడ్డా లెక్కచేయకుండా వచ్చాం. మనరోగం కుదిరింది. అందరికి విరోధమైన ఇప్పుడేంచేయాలి. అందరం కట్టకట్టుకొని యమునలోపడి చద్దా"మంటు మరొక గోపిక.

అప్పుడొక గోపిక తెలివిగా ఒక ఉపాయం చెప్పిందీరీతిగా :

"నాతుకలార! తో చెడిని

నా కొక యూహ, అతండు గుండెలో

పాతుక కూరుచుండి యెద

బాధయు నీ వలవంత కూర్చెడిన్

ఘాతుకవృత్తి, వాని నిటఁగాఁగన
మంచున గాదు, గుండె నా
లోతు కనంగఁ ద్రవ్వుడు
తల్లోదరులార! ఈనాగ నెంచినన్"

ఇది భక్తకోటికంతకు కవియిస్తున్న సందేశం. భగవంతుణ్ణి హృదయంలో దాచుకోని గుళ్ళల్లో గోపురాల్లో అన్వేషిస్తాం. ఆయన అంతర్ముఖ సులభుడనే సత్యం విస్మరిస్తాం. "విభ్రాంతిని గూన్పనేల? హరి భావన చేయుడు గుండె లందునన్" అనేది గోపికా ముఖాన కవిచేసే హెచ్చరికే.

గోపికలెంతగా శ్రీహరిని గూర్చి తపించారో యీ పద్యాన్నిబట్టి ఊహించుకోవచ్చు :

"నిన్నుం గూరిచి యూహసేయుటయు
గానీ నీదయాధీనమై
యున్నన్ జంపగనేల నన్ మకుట
మా యూ గ్రాగపించఛచ్ఛవీ!
కన్నుల్ లోతుకుపోయి
మాట పెగులంగా రాక రొమ్మొండినే
నున్నన్ జంపుట మేలికా
మకుటా మా యూరాగ్ర పించచ్ఛవీ!"

రెండు సంబోధనలు ఒకటే. 'నెమలిపింఛపు కాంతితో శోభించేవాడా!' అని సకల భూతములందు తనకున్న ప్రేమకు చిహ్నం ఆ మయూర పింఛం. తన్నుగూడా దాన్ని గౌరవించినట్లే గౌరవించమని కోరకుండానే కోరడం ఇందులో ధ్వనిస్తుంది.

చివరగా గోపికల హెచ్చరిక సుప్రసిద్ధమైంది. 'కల కంఠ కంఠి కన్నీరొలికిన సిరియుండదనే'నేది.

"ముదితల కేటిసేరు శుభమున్
గలిగించద యేరికైన నీ
ముదితలు నమ్మియున్న జనముల్
మరిహాస్యము తీరిపోయె, నిం
తదిగాలు చేయుచున్ విదయ
నాటికి కన్పడనట్టి చంద్రుడున్
తదియకునైన కన్పడక తప్పదు,
రాగదె నంద బాలకా!"

హాస్యానికి అంతుండాలి. ఏడిపించటానికి అవధులుండాలి. లేకపోతే అనర్థం తప్పదు. భక్తుల ఆర్తికి స్పందించకపోతే భగద్విశ్వాసమే నశిస్తుంది. గోపిక లింతటి ప్రేమార్తిమూర్తులు కాబట్టే నారదుడు వాళ్ళనే ఉదాహరిస్తాడు "యథావ్రజగోపికానామ్" అని దివ్యమునులకు కూడా ముమ్మందు పూజనీయులైనారువీరు. ప్రతి జీవుడు గోపిక కావాలి. భగవదనుభూతికి పరితపించాలి.

**అన్వేషణ** : కృష్ణాన్వేషణ మనగానే భాగవతంలోని ఈ క్రింది పద్యం ఆ బాలగోపాలానికి స్మరణకు వచ్చి రసనాగ్రాన నర్తిస్తుంది.

"నల్లనివాడు, పద్మనయనంబులవాడు
కృపా రసంబుపై
జల్లెడు వాడు, మౌళిపరిసర్పిత
పింఛమువాడు, నవ్వు రా
జిల్లెడు మోము వాడొకడు
చెల్వల మానధనంబు దెచ్చెనో
మల్లియలారా! మీ పొదల
మాటున లేడు గదమ్మ చెప్పరే!"

ఆ తరవాతి పద్యం పైదానంత ప్రసిద్ధం కాక పోయినా హృద్యమైందే:

"అంగజునైన జూడ హృదయంగముదై
కరగించువాడు శ్రీ
రంగధురంబువాడు, మధురంబగు
వేణురవంబువాఁడు, మ
త్స్యాంగజు పువ్వుదూపులకు
నగ్గము సేసి లవంగలుంగనా
రంగము లార! మీ కడకు
రాడుగదా! కృపనున్నఁజూపరే!"

పోతనార్యుని భాగవతంలో పదిపద్యాల్లో సాగిన ఈ కృష్ణాన్వేషణను విశ్వనాథ వారు శతాధిక పద్యాల్లో చమత్కార సుందరంగా ప్రపంచించారు. ఇందులో ఎన్నెన్నో చెట్లను వాటి లక్షణాల్ని ప్రస్తావించి, తదనుకూల లక్షణాలు గల శ్రీ హరి వాటి చాటున దాక్కున్నాడేమో పట్టివ్వండని గోపికలు ప్రార్థిస్తారు. చెట్లనే కాకుండా వివిధ జంతుజాలాన్ని కూడా ఆరీతిగానే అర్థిస్తారు. ఈ సందర్భంలో కవి చూపిన లోకజ్ఞత అసాధారణమైంది.

పోతనగారి పై పద్యంలో వేణువు, మాణిక్యాద్యలం కారాలులేవు. పింఛ మొక్కటే బయటనుండి తెచ్చుకొన్న అలంకరణం. అడవిలో ఎక్కడబడితే అక్కడ లభించేది. విశ్వనాథవారు సాలంకృతుడైన శ్రీ కృష్ణమూర్తిని సొంత శైలిలో ఇలా వర్ణిస్తారు.

"శ్రీకృష్ణున్ హరి మీ కెరుఁగుదురుగా
చేవేణు దండంబు చూ
డా కల్పంబగు నెమ్మిపించియును
కంఠంబందు మాణిక్యమున్
మీకున్ గన్పడెనా యెటేని? హాసనో
న్మీలన్ముఖాబ్జుండు తా
నై కాంతార సరస్తటీ
లతి లారా! భీతనేత్రంబులన్

అయితే ఈ పద్యంలో ముఖ్యంగా గోపికలెందుకు వెదకుతున్నారో కారణంలేదు. వాళ్ళ అభిమానం దొంగిలించుకు వచ్చాడు. దొంగను వెదకుతున్నారు.

ఆ కొరతను గుర్తించే విశ్వనాథ రెండో పద్యాన్నిలా అందించారు.

"కనుంకు మంచివానివలె
గన్పడు, చోరుడు, పారిపోయి వ
చ్చిన గజదొంగ, కన్పడును,
చిత్తమున్ హరియించు. దొంగసా
మ్మని గుర్తించి పట్టుకొనన్నైనను
పిల్వడకుండజేయు, నా
తని నిట మీరు చూచినను
దప్పక వల్లికలార చెప్పుడీ!"

అభిమానధనాన్ని హరించి వచ్చిన దొంగగా అభివర్ణించాడు – పోతన,చిత్తాప హరణం కంటే అభిమానాన్ని హరించటం గొప్పనేరం. ఏమైన దొంగగా పేర్కొనటానికి బాహ్యంగా గోచరించే వస్తువులు లేవని విశ్వనాథ చమత్కరిస్తాడు. పోతనతో విశ్వనాథ పైకి కానరాకుండానే పోటీపడతాడు. ఇంకా విశ్వనాథ వారి కృష్ణుడెంతటి ఘరానాదొంగో గోపికలిట్లా హెచ్చరిస్తారు.

"మీరల లెక్కంగకుండగనె
మీకడ దాగెకి నేర్పు నేర్చెంబో
ఆ రమణుండు మీ చిపురు
లందున పూవులయందు దేనెలం
దారసి మీకు చెప్పవలె
నన్నను. చెప్పకయుండు బుద్ధి చే
కూరగ జేసెడున్ హృదయ
కోమల భావమునందు చోరుడై"

కనుకట్టు, వాకట్టు విద్యలెన్నో నేర్చిన దొంగ. చివురుల్లో చివురై పోతాడు. పూవుల్లో పూవు అవుతాడు. ఒకవేళ కష్టపడి గుర్తించి చెప్పాలన్నా, నోరు కట్టేస్తాడన్న పద్యంలో శ్రీ కృష్ణుని పరమేశ్వరత్వాన్ని ధ్వనింపజేసి సహృదయుల్ని లోకోత్తర చమత్కార భరితుల్ని చేస్తాడీకవి.

దొంగ లక్షణాల్ని బాగా నిర్దేశించి ఒక్కొక్క పద్యంలో ఒక్కొక్క వస్తువును విచిత్రరీతుల్లో ప్రశ్నిస్తారు గోపికలు. ఆ చమత్కార వైభవం అనంతం. కొన్ని మచ్చుకు చూద్దాం :

‘‘వయసుతో మొగమేమియు మాఱ్పు పొందదే అవికాపడు)
‘‘శ్రీ యుతమూర్తి నోసి బదరీ! పదరీతుల దిక్కు చూపవే!’’

"మాకందంబ! యశోదబిడ్డ చరణాబ్జానంబులౌ పన్నెలన్
మాకందంబులటంచు దాచుకొనకమ్మా! కమ్మకస్తూరి ల
క్ష్మీకాంతాకుచ కుంకుమార్ద్రఘుళితోర్మిన్ రశ్మి కాశ్మీర రే
ఖాకారంబది నీకుఁదోచును గదమ్మా తోచిసంజెప్పవే!"

"ఉసిరిక! నీకు నాతనికి నున్నది కొండొక కూర్మి చెప్పవే!"

‘‘శిశ్వాకారంబును బూని పండుకొనెనో అట్టాకలంబెట్టు మ
ట్టాకున్ దానిని జూపవేవట! ధరాప్రహ్వాకృతాధో జటా!’’

ఈ విధంగా తులసిని, రావివేపదంపతుల్ని, జంబూవృక్షాన్ని, కడిమి చెట్టును, పొన్నను, ఇప్పను, కొండగోగును, దిరిసెనను, మందారాన్ని, లొద్దుగను, గంగరావిని, సంపెగను, తెల్లగన్నేరును, కర్కారువును, సుగంధిపాలను, మొదలైన వాటిని ఊరకే ఏకరువుపెట్టనట్లుగాకాక, వాటివాటి పృథగ్లక్షణాల్ని సమీక్షిస్తు గోపికలు శ్రీకృష్ణుణ్ణి అన్వేషించటం అపూర్వంగా సాగుతుంది.

భగవంతునికి సూర్య చంద్రులు నేత్రాలు నేత్రాలకు తామరపూలతో సామ్యం చెప్తారు. సూర్యుడుదయించకపోతే తామరపూలు వికసించవు. శ్రీకృష్ణుని నేత్రంలో సూర్యుడుదయిస్తాడు. ఆ సూర్యుని యనుగ్రహంచేత తామరపూలు వికసిస్తున్నాయి. ఆ పూలతో స్వామినేత్రాలకు సామ్యం చెప్పటం ఏమి

తెలివని గోపికలు తమ తెలివితక్కువతనాన్ని విమర్శించుకొంటారు. ఇట్లాంటి చమత్కారాలు ప్రతిపద్యంలోను పొడగట్టుతాయి.

ఇట్లాగే పక్షుల్ని, జంతువుల్ని గూడా ప్రశ్నిస్తారు గోపికలు. మొట్టమొదట ఒంటికాలిమీద తపస్సు చేసే బకాన్ని స్వామి తొలిరూపాన్ని భక్షించవద్దని కోరుకొంటారు కురంగాల్ని, గుడ్లగూబల్ని శకునాల పాలపిట్టల్ని, చేతకాల్ని, అడవికోళ్ళను, పిచ్చుకల్ని; చిలుకల్ని, వడ్రంగి పిట్టల్ని, పలు రించు నాథుని జాడల్ని చిత్రవిచిత్ర రీతుల్లో ప్రశ్నిస్తారు.

తిరిగి చెట్లను, మరికొన్ని చోట్ల గోచరించిన వాటిని ప్రశ్నిస్తారు. అవి వకుళం, అడవి మల్లె, వావిలి, మాధవి, మాలతి, ముండ్ల గోరంట్ల, మంకెన, జపాలతాంతం, మాతులుంగ, కదళి, నాగమల్లిక, మొదలైనవి.

ఇందులో వకుళలక్షణం విలక్షణం. వాడివత్తులై అధికంగా వాసిస్తుందది. అలాగే తామూ ఉండాలనే ఆకాంక్షను గోపికలిట్లా ప్రకటిస్తారు.

"పతి విడనాడి వత్తులయి
ప్రాలెడు కేలపయిన్ హృదంతర
స్థితము పరీమళంబును
త్యజించవు భర్తృమనోజ్ఞను యాయి నీ
మతియును గల్గినన్ వకుళమా!
నినువంటిది కల్గగా వలెన్
పతిపయి మేము నీసునెఱపం
జొరనట్టుల నేర్పిపెట్టవే!!"

కాలి జాడలు వెదకటం మొదలుపెట్టారు గోపికలు.

"స్వామి మొగంబుకంటె ప్రభు
పాదము మిక్కిలి సేవనీయ మం
చా మునులామునుల్ వలుక
నంబుజలోచన వింటిమున్న"

అని మడమ పైకెత్తి పూలు కోస్తున్న కన్నయ్య కాలిజాడ ఎలాఉంటుందో వర్ణిస్తాడిట్లా కవి, పెద్ద పోలీసులాగా

"ఇదిగో! యింకొక పాద చిహ్నము
ప్రభుం డిచ్చోట వయ్యారపుం
బడమై ప్రక్కగ గాలుమోపి
మడమం బైకెత్తి నిల్చుండె నే
పొదయందగ్గర లేదు కాద
యెదియో పుత్రుంచగా నొంచె నం
చెద భావింపగ స్వామి యీ
యెరుగకే హేలాక్రియం జేసెనో"

అన్వేషించి, అన్వేషించి చివరకు శ్రీకృష్ణ తాదాత్మ్యాన్ని పొంది ఒక గోపిక యీ రీతిగా ఉద్ఘాటిస్తుంది.

"అరయుడు మీకు నా సెలవులందున
సన్నని వెన్న చాల
బ్బురముగ దోచు, నేను గిరి
మోసెద, పాము తలన్ నటించెదన్
విరవిరలాడ గుండియలు
వేణువునూదెద, ధాత్రి సాదెదన్
శరనిధి నీదెదన్, దనుజ
సంతతి మోదెద, మిన్నులాదెదన్"

అన్వేషింపగా, అన్వేషింపగా, భ్రమరకీట న్యాయంలో ప్రతి గోపిక తాను శ్రీకృష్ణ తాదాత్మ్యాన్ని పొందుతుంది ఈ అద్వైతసిద్ధి భక్తి పరాకాష్ఠ. ఇంతటి కృష్ణభక్తి నాలాపించిన వివంచి ఎక్కడైనా ఉన్నదా తెలుగు సాహిత్యంలో?

సాక్షాత్కారం :— మంత్రాలు, జపాలు, తపాలు, హోమాలు లేకుండానే ఏవిద్యాగంధంలేని గోపకాంతలకు గోపాలుడు సాక్షాత్కరించాడు. జడదారులైన ఋషులు తీవ్ర మంత్రాలతో భగవంతుణ్ణి బిగించివేస్తుంటే, ఉక్కిరిబిక్కిరై పరమాత్మ వాళ్ళ బందిఖానాలోనుండి విముక్తుడై స్వేచ్ఛగా ఏమంత్రాలురాని యీ యమాయికలతో ఆటపాటలతో ఆనందిస్తాడని కవిభావన.

భగవత్సాక్షాత్కారం కలిగితే మొట్టమొదట శ్రీచరణాల్ని సందర్శించాలి. స్వామి త్రివిక్రముడు. ఆయన పాదంలోనే మూడులోకాలు ఉన్నాయి. మడమ పాతాళం. నడిమిభాగం మర్త్యలోకం, వ్రేళ్ళు స్వర్గం అని కవి సమర్థనం. ప్రొద్దు పొడుపు పువ్వులో అవిసె పువ్వుదూర్చి చివర పారిజాతపూవ్వులు పేర్చితే యెట్లా వుంటుందో స్వామి యరికాలారీతిగా ఉందనటం అద్భుతమైన ఊహ. ఇలా ప్రతి పద్యంలో చమత్కార వైభవ మట్టిపడుతుంది. స్వామి ప్రత్యంగసుషమ పాదాలతో ప్రారంభమై మీదకు అభివర్ణితం.

స్వామి మొల ఇలా రవళించిందట :

"కోమల కింకిణుల్ చిగుత
గువ్వలు కూసినయట్లు, పావురా
లామెతలందినట్లు నడయాడి
మణీనివహంబు క్రొక్కెమ్మల్
గా మలగించి త్రాటు, [illegible]గా
నటియించు మయూరి పచ్చ కు
చ్చై మొలయందగించె నివి
జాలయ గోపురమట్లు స్వామికిన్"

ఈ మొలమువ్వల ధ్వని విని ఆవులు తాము భద్రంగా ఉన్నట్లు భావిస్తవి.

గొల్లభామలు గొల్లలనే ప్రేమిస్తారు. అన్యకులజుని ప్రేమించరు. ఇదే కులశౌచం అంటే.

"పిల్లన గ్రోవియుం దలను
బెట్టిన వన్నెల పించియుమ్ము సం
ఫుల్లము పచ్చనౌపదకమున్
చిరునవ్వుల మోము దమ్మియున్
గొల్లల పిల్లవాడ యనుకోమకి
సిగ్గగునేమొ స్వామికిన్;
గొల్లడు కాదయేని మనకున్
మరి సిగ్గది యేలనే చెలుల్"

వ్రేపల్లెలో విష్ణుమూర్తి అవతరించి దానికి మహావైభవాన్ని చేకూర్చినట్లు [illegible]
ఈరీతిగా పేర్కొంటాడు :

"పిల్లనగ్రోవికిం జివర పెట్టిన
సన్నని పట్టుకుచ్చులై
పల్లన పట్టుకుచ్చులకు
పైదగు చిన్నవి హొన్నుకుప్పెలై
అల్లన హొన్నుకుప్పెలకు
నంచుల దాపిన యెఱ్ఱజాలు వ్రే
పల్లెకు బట్టినట్టిదగు
వైభవమంతయు రూపుకట్టెనా!"

స్వామి చేతి కందే మేఘమువంటివాడట. ఆతని జొమ్ము గాఢశ్యామలములతో చేసిన కమిడిపూలవలె ఉంటుందట. మువ్వలతో గజ్జెలతో, పట్టుకుచ్చులతో, అలిచిప్పలతో, దక్షిణావర్త శంఖాలతో, మొలలోదోపిన వేణువుతో అలాంటి నిక్కు అయిన స్వామి కటి ప్రదేశంలాగా యమునానది ఉన్నదని ఉత్ప్రేక్ష.

స్వామిని కన్నులార కాంచినందుకు గోపికలు తమలో తామిట్లా ఆనంద భరితలౌతారు :

"నిన్నన్వేషణ చేయుగా నుపనిష
సన్నికాశమాదాని బృం
దన్నిర్వ్యాజ కిసాలపత్రసుమ
సౌందర్యైక వారాశి గ
న్గొన్నామిచ్చట నిన్ను వేదపుగొసల్
నూలోకవు, నీవుంటి బృం
దన్నీవుండవు వేదపుం గొసల
గృష్ణా! వల్లవీ పల్లవా!"

సహృదయుల హృదయాలు బృందావనాలు కావాలి. జీవులు గోపికలు కావాలి. వేణునాదాలంతరాత్మల్లో వినకల్గాలి. అదికృష్ణభక్తికి నిదర్శనం. తత్సిద్ధి కల్గించేది ఉత్తమ కవిత్వం. అదే మధురభక్తి ప్రపుల్ల కవిత్వం. వ్యాసుడంతవాడు అటువంటి కవిత్వాన్ని అందించటానికి కొంత ప్రయత్నించాడు. విశ్వనాథకూడా తెలుగులో కొంత ప్రయత్నంచేసాడు అయినా అతనికి తృప్తిలేదు. ఆలోతులెరిగిన కవి ఎవ్వరూ తృప్తిపడలేదు :

"హీరమువంటి నీ యెడదనే
చిరు బెజ్జము చూచినాడో నీ
మూరట రూపమైన ముని
మాధవ! వ్యాసుడు గోకులాంగనా
శ్రీ రమణీయ మాధ్వమును
సృష్టి యొనర్చెను ముక్తి తోవలన్
గేరడమాడు విద్యభుజ
కీర్తులు మాదృశులంగలార్పగన్"

భ్రమర గీతలు : శ్రీకృష్ణుడు వ్రేపల్లెను వీడి మధురా నగరానికి పోతాడు. పిమ్మట ఉద్ధవుని వ్రేపల్లెకు బంపుతాడు. ఉద్ధవుడు వినేట్లు, తుమ్మెదను జూచి అది తమవద్దకు బంపబడ్డ దూతగా కల్పించుకొని, అతనికి అన్యాపదేశంగా

ఎరుక పడేటట్లు గోపికలు కావించిన చతురభాషణాలు భ్రమర గీతలుగా భాగవతంలో రూపొందాయి. ఇవి పది పద్యాల్లో భాగవతంలో వర్ణితం. వీటిని విశ్వనాథవారు నూరు పద్యాల దాకా ప్రపంచించారు. ఇందులో విశేషమేమంటే ఈ పద్యాలకు వారే ప్రతి పదార్థ తాత్పర్యాదుల్ని గూడా సంతరించారు. అప్పటికైనా వారి భావుకతను లోకం గ్రహించి ఆనందిస్తుందని వారు ఆశించి ఉంటారు.

ఈ తుమ్మెద ఒకప్పుడు 'వనీవాటీసుమాఖ్యాక రేఖాసంపన్నుడు' ఇప్పుడు 'ఉద్యానవాటీసుమాఖ్యాస శ్రీ పదమూర్తి.' అయి గొప్పమాయావియైనాడు. ఇతణ్ణి నమ్మరాదని ఒక గోపిక యింకో గోపికతో అంటుంది. 'వల్లీమందాక్షులు' ప్రేమించిన ప్రేమింతురు. ప్రేమించరయేని యంతె ప్రేమించరు. కట్టా మోసము చేయ విరకటము లేదుగదె! అని వారనుకొంటారు. 'నగరవాసుల మోసమెఱుంగ శక్యమే!' అని ఆశ్చర్యపడతారు. లోకంలో పేదవారిని ధనవంతులు సంపదను వెలయించి మోహింపజేస్తారని, తమ ఆహార్యాధిక్యం చేతనే నగరవాసులు గౌరవాలు పొందుతారని, వారివి పైపై మర్యాదలేకాని హృదయపూర్వకం కాదని, వారి పైపై మాటలకు జానపదులు మోసపోరాదని వాళ్ళలో వాళ్ళు హెచ్చరించుకొంటారు. జానపదుల్ని బాధించటమే వారికి విలాసమట.

గోపికలగుండెలు కృష్ణవియోగానికి పుండ్లువడ్డాయి. అవియిప్పుడిప్పుడే మానుతుంటే ఈ రాయబారంవల్లతిరిగి దెబ్బతగిలినట్లైందని ఒకానొక గోపిక యీరీతిగా వెతజెందుతుంది :

"తానపుడేగె, బిట్టు నెడదం
డపియించితిఁ గొన్నినాళ్ళుగా
కానలలోపలం జనియెఁ
గాలము మిక్కిలి విస్మృతింగనన్
పూనిక నంతయు న్మరచి
పోయితి నుంచను కొంచునుంత ని
న్నైన మరేల పంపెగొటి
లాత్మఁడతం డగుచున్నధుప్రవతా!"

నగరవాసియై పూర్వం లోకానికి సుపరిచితమైన వేషం మార్చలేదుగదా! అని ప్రశ్నిస్తారు. చీకటిరాత్రుళ్ళలో ఒంటరిగా పిల్లనగ్రోవి వాయించు కొంటుంటే మేము పోయి అండగా నిల్చాం. అటువంటిది మమ్మువదలిపోయినాడు. మమ్మ మరచాడు కృతఘ్నుడు అంటారు.

ఎన్నో ఆగడాలు చేసినా అన్నీ కప్పిపుచ్చాం. పాలొలక బోసాడు. వెన్న దొంగిలించాడు. తన తల్లితో చెప్తే ఆమె ఏంచేస్తుందో అని అవన్నీ మానెత్తినే వేసుకొన్నాం. అయినా దయావిహీనుడై మమ్మువదలి పోయినాడని ఎత్తి పొడుస్తారు.

"ఆతత మాంసతృష్ణమెయి
నాటకకుండడకు వేటకాడు సం
గీతము పాడికానల మృగీ
నిచయమ్మును మోహపెట్టి న
ట్లాకడు మారుకోల్తలకు
నగ్గము చేసెను మమ్మ వానిదిన్
నీతి యటంచు చెప్పుదురో!
నేర్పవి యాదుదుగో మధువ్రతా!"

అనేప్రశ్న చాలా ఘాటైంది. కృష్ణుడాటవికుడుగా క్రూరంగా ప్రవర్తించాడుగదా! అందుకే ఆటవికుని చేతిలో అంతమైనాడేమో!!

ఇంటివద్ద భర్త లిచ్చేదేహసౌఖ్యానికి, బృందావనంలో స్వామిచేకూర్చే ఆత్మానందానికి రెంటికి చెడ్డ రేవడుల మైనామని ఆవేదన వెళ్ళగక్కుతారు, తుమ్మెదలో గోపికలు.

స్వామికి తగిన దూతవు లభించావని యిలా నిందిస్తారు :

"ఒకపువ్వుదేనె గ్రోలావి, మరి
యొక్క పువ్వునగిలిగింత పెట్టి, యిం
కొక పువ్వుదిమ్మరై పదము
లొత్తుచు, నేగు ననహ్యశీలి! నీ

కొఁకని* పట్ట దింతయు

మధూదయకాల మిల్లి, పూఁటున

తుకతుక, స్వామికిన్ తగిన

దూతవు వచ్చితివోయి మధుపా!"

మేఘసుందరుడని శ్రీకృష్ణుణ్ని గొప్పగా అంటారు. ఎందుకు? గొప్పయింటి ఉ కాబట్టి. ఇది పైకి పొగడ్త. లోపలనల్లనివాడని ఆక్షేపణ. మేఘానికున్న ణాలు ఈయనకు ఉన్నాయి. దానిలాగా మెరపిస్తాడు పైకి ఘర్తలాగా ంచాడు గోపికలకు. తుమ్మెదలాగా మేఘం కూడా రాయబార చేస్తుంది. లాల్లో కురవకుండా నగరాల్లో వర్షిస్తుంది, అక్కడకలేనిపోం. ప్రేమించే ్యని వదలి కాముక వృత్తితో జీవించే వాళ్ళతో సంచరిస్తున్నాడని గోపికల క్షేపణ. ఈవిధంగా భ్రమరగీతల్లో పల్లియ సహజ ప్రణయ జీవనాన్ని శంసిస్తు నాగరక కృతక వ్యామోహ జీవనాన్ని విశ్వనాథ విమర్శిస్తు కవిత గించారు.

భ్రమరగీతల్లో గురుశిష్యుల ఉపాసన పద్ధతులు ధ్వనిస్తాయి. భగవంతుడు మ్నల్లోకి చూడటం, ఉల్లంలోకి ప్రవేశించటం, భగవంతుణ్ని తమ ృధయాల్లోకి ఆవర్జించుకోవటం ఇటువంటివి. ఈ సాధన హటాత్తుగా ఆగి యిందనే విచారాన్ని వెళ్ళగ్రక్కుతుందాక గోపిక ఈరీతిగా :

"పిల్లన గ్రోవియూఁకుచును

వెన్నుడు మూకనులందు చూచు, మా

యుల్లములందు జొచ్చు, పతి

యుల్లమునందున జొత్తుమేము నా

పిల్లన గ్రోవి యందువిని

పించిన రావము లాగికొన్న దే

వెల్లువ చేతనోహారికి

వెక్కసమైతిమి నేడు మధుపా!"

స్వామిసేవలేమరక చేసారు, గోపికలు. జుట్టుదువ్వారు. అల్లరిమాన్పారు. ఎత్తుకొన్నారు.ఆరగింపజేసారు. రతిలో పులకించారు. అన్నిసేవలుచేయించుకొని వాళ్ళను విస్మరించాడని వెతజెందుతారు.

కులకాంతలు భర్తపేరు చెప్పమన్నప్పుడు గోత్రస్ఖలనంచేసి 'కృష్ణ' అన్నారు గోపికలు. పరిహాసం పాలైనారు. అయినా సహించారు గోపికలు.

ఇండ్లలోని భర్తలు 'కంటికి భర్తలు', కమ్మని ప్రాణపులోతునందు నీతుంటరి భర్తయైనాడు వారికి.

ఇట్లనేకరకములుగా శ్రీకృష్ణుని నిందిస్తారు గోపికలు ఆతరువాత విశ్వనాథ వారి గోపిక అనుభవించిన కార్శ్యం, అరతి, లజ్జాత్యాగము, సంజ్వరము, ఉన్మాదాది వివిధ మన్మథావస్థల్ని చమత్కారోపేతంగా అభివర్ణిస్తారు.

తమ రమణుడు వేణువూదు పని వదలి మధురాపురంలో చిత్ర విచిత్రాలైన శౌర్య కృత్యాలు కావిస్తున్న కథలు విని గోపికలాశ్చర్యాన్ని ప్రకటిస్తారు. పరమ సాత్వికుడైన స్వామికీ రాజసకృత్యాలెందుకో వారి కవగతం కాలేదు. తమ హృదయాబ్జాల్ని వికసింపజేసే బాలభాస్కరుడీరీతిగా చండభాస్కరుడు కావటందేనికో తెలియక వారు విచారిస్తారు.

ఆత్మగత దుఃఖాన్ని క్రమించి గోపికలు తత్త్వవిచారంలోకి దిగుతారు. స్వామికి ఏపడతులంటే ఇష్టం? ఎవరంటేయిష్టంలేదు?సచ్చిదానంద స్వరూపునకు స్త్రీవాంఛ ఏమిటి? ఇదంతా ఒకనాటకం, మాయ. ఆయన ప్రేమంతా ఆ లక్ష్మీదేవి మీదనే. మమ్మల్ని ఆయన 'మానినులంచ తలంపడు?' అనటం అద్భుతమైన ధ్వని. త్రేతాయుగపు మునిపుంగవులే వీరు. ఇలా జన్మించటం ఆయన ఆలింగన సౌఖ్యానుభూతికే. ఇంక నీ రాయబారం వ్యర్థమని తుమ్మెదను వారు హెచ్చరిస్తారు.

విశ్వనాథ వారి గోపికలు క్రమంగా జ్ఞానులుగా రూపొందుతారు. ఆ పూర్వ జన్మవాసన ఏలాపోతుంది? అచ్ఛసత్త్వమూర్తియైన స్వామి లోకపాలన కార్యం నెత్తిమీద వహించటం చేత రజస్తమోగుణాల్ని స్వీకరించి మందుడైనాడని నిందిస్తారు.

గోపికలెంత జ్ఞానులైనా శారీరకంగా కల్గిన సౌఖ్యానుభూతి విస్మరించ లేక పోతారు. స్వామి చిన్నతనంలో ఉమతో ఆడుకొనేటప్పుడు తన కాలి రెండు వేళ్ళతో తమ చూచుకాల్ని నొక్కిపెట్టేవాడు. ఆ అనుభూతి ఎప్పటికి మరపురానిది. ఇటువంటి ఊహల్లో విశ్వనాథ అంచెవేసినచేయి.

చిన్నప్పు డడవుల్లో గోపికలను ఏడిపించటానికి దాక్కొనేవాడు. పిల్లవాడు తప్పిపోతాడని వారు భయపడేవారు. స్వామి స్వామియనే జ్ఞానోదయం వాళ్ళ కప్పటికి లేదు. జీవులకు భయం ప్రధానం. అది గుండెల్లో ఉండేది. ఇప్పు డాయన పట్టణంలో రజస్తమో గుణాలు గల జీవుంలో సంచరిస్తున్నాడు. ఇంక మేము వెదకే మార్గం లేదు. అని అనేక విధాల విచారిస్తారు.

గోపికల భావన ఈ క్రిందిపద్యంలో పరాకాష్ఠనందుకొంటుంది.

"సాగిన మాయెదల్ చలువ చప్పరముల్
యదుసింహమూర్తి యూ
రేగుచునుండె బో, రథము లెక్కియు
బల్లకు లెక్కినేడు నూ
రేగడుగాదె యిప్పుడు హృదీశ్వరు
డుత్సవమూర్తి, యాలయ
శ్రీగురుతించ కిప్పుడు
చరించు విరాట్టని లేకపట్పదా!"

దేవాలయాల్లో విరాణ్మూర్తి ఉంటుంది. ఉత్సవిగ్రహాల్నే ఊరేగిస్తారు. ఉత్సవమూర్తియైన స్వామి గోపికా హృదయాల్లో చలువ చప్పరాలతో పూర్వం ఊరేగాడు. నేడు పట్టణాల్లో రథాలెక్కి, గుర్రాలెక్కి ఊరేగుతున్నాడు విరాణ్మూర్తి. అట్లా జరుగరాదుకదా! ఈ నియమం సంపూర్ణావతారమైన ఈయనకు వర్తించదని, అది అంశావతారాలకేనని విశ్వనాథ వారి సమర్ధన.

తమ్మూరడించటానికి వచ్చిన ఉద్ధవునకు విశ్వనాథ గోపికలు భగవత్తత్త్వాన్నే అన్యాపదేశంగా ఉపదేశిస్తారు. భగవంతుడు రాక్షసులను చంపి మోక్షమిస్తాడు. భక్తులు భగవంతుని పొందటానికి పడరానిపాట్లు పడతారు. తామా రీతిగా బాధలకు గురి కావటం తమ జ్ఞానాభివృద్ధికే అనే విశ్వాసాన్ని గోపికలు ప్రకటిస్తారు.

గోపికల భావనలో పరిణతిని నిరూపిస్తారు విశ్వనాథ. జీవులందరు గోపికలే. జీవులందరు అటువంటి పరిణతిని సాధించటానికి సదా పరితపించాలని విశ్వనాథ లోకానికి కావ్యంద్వారా చేకూర్చే సందేశం. కాని భాగవత గోపిక లింతనేర్చినవారు కారు. వారు నిరంతర కృష్ణ సందర్శన లాలసలు మాత్రమే. ఆ లాలసత్వమే ఉద్ధవుణ్ని ఆశ్చర్యపరచింది. ఇట్లా అంజలింపజేసింది :

"జపదాన వ్రత హోమ సంయమ
తపస్స్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నేవిభున్
మనములన్నిల్పంగ లేరట్టి స
ద్విపు లాకారునిపై మహామహిముపై
విశ్వేశుపై మీకజ
ప్రపటుధ్యానము లిట్లునిల్చె నౌ!
భవ చ్చారిత్రముల్ చిత్రముల్"

శ్రీకృష్ణ సంగీతము :— కవిసమ్రాట్ కృష్ణకవితా కలాపంలో ఈ కావ్యం ఒక కన్ను. ఇది గీతపద్య మాలికలుగా వివిధ శీర్షికల క్రింద విరచితం. శ్రీకృష్ణ సంగీతాకృష్టులైన గోపికలు లౌకిక నియమాలకు, అలౌకికానందానుభూతికీ మధ్య ఎలా నలిగిపోతారో నిరూపిస్తాడు కవి.

వ్రేపల్లెలోని గోపకులు, గోపికల అవినీతికి వారిని వదిలివేస్తే వారేం చేస్తారు? యమునలోబడి చస్తారు. యమున సముద్రాన్ని జేరుతుంది. కడలి యశోదబిడ్డను జేరుతుంది. "ఇంత ఇంత చచ్చెందుకులే యొయారి! సూటిగా

స్వామిలోననే చౌరుడ"ని అనుమతిస్తారు గోపకులు. ఇటువంటి శావాలీ కావ్యంలో కోకొల్లలు.

ఇలా శ్రీకృష్ణ ప్రణయాన్ని యథాశక్తిని నిరూపించిన విశ్వనాథవారి తీరులోని తియ్యదనాన్ని కొంతవరకే రుచిచూపించ గల్గాను. ఎంతకాదన్నా కృష్ణభక్తి సామాన్యులకు కుదరటం కష్టం. ఆంధ్రప్రజానీకం రామభక్తిపరాయణ మైంది. తండ్రి రామభక్తుడు. తండ్రి ఆజ్ఞశిరోధార్యం. ఇన్నేండ్లుగా తానుసము పార్జించిన కవితాశక్తినంతా ధారపోసి రామాయణ కల్పవృక్షాన్ని కల్పించి తన తపస్సును పండించాడు. ద్వాపరయుగంలోనుండి త్రేతాయుగంలోకి వెళ్ళాడు. ఇది సంప్రదాయజ్ఞుని లక్షణం :

కలియుగాంధ్ర కాళిదాస! ద్వాపరయుగ వ్యాసఋషీ!!
త్రేతాయుగ వాల్మీకీ! సతులు విశ్వనాథకవీ!!



# శారదా సమారాధన సారథ్య సంఘసభ్యులు



శ్రీ ముమ్మనేని సుబ్బారావు

శ్రీ చెవుటూరి తాండవ కృష్ణ

శ్రీ ఆలపాటి సత్యనారాయణమూర్తి

డాక్టర్ సి. నాగేశ్వరరావు

డాక్టర్ సి. సుధ

శ్రీ ఎస్. వి. విష్ణువర్ధనరావు

శ్రీ ఆడవిల్లి సత్యనారాయణ

శ్రీ బొడ్డపాటి సుబ్బన్నశాస్త్రి

శ్రీ చిట్టూరి శివ బాలసుబ్రహ్మణ్యం

శ్రీ బబ్బేపల్లి రాధాకృష్ణమూర్తి

డాక్టర్ బాపట్ల రాజగోపాలశర్మ

# ఆధునికాంధ్ర కవిత్రయ
# శారదా సమారాధనం

ముగ్గురు కవులపై మూడు సాహిత్యోపన్యాసాల వ్యాసీకరణ






1. రాయప్రోలువారి కవితా రామణీయకం
2. కాటూరివారి కవితాత్మ
3. కవిసమ్రాట్ కృష్ణ కవితా కలాపం




శ్రీ గిరిజా ప్రచురణలు
శ్రీనివాసనగర్ కాలని
గుంటూరు - 6

ముద్రణ : శ్రీ లక్ష్మీప్రెస్, అరండల్ పేట, గుంటూరు-2.